# వృషనామ సంవత్సర — చైత్ర - వైశాఖమాసములు

1941-వ సం॥ ఏప్రిల్ నెల

| | | |
|---|---|---|
| 1 | మం | చ ఉ 8-30 కృ సా 4-17 వర్జ్యములేదు ఉదు 8-23 రాదు 10-55 ల |
| 2 | బు | పం ప 10-12 రో సా 6-26 ఉవ 9-43 ల 11-28 వ రావ 12-33 ల 2-15వ |
| 3 | గు | ష ప11-33 మృ రా8-14 తెవ5-15 ల6-51వ దినం30-19 ఉదు9-59 మదు2-51 ల |
| 4 | శు | స మ 12-25 ఆర్ద్ర రా 9-31 ఉ శేవ 6-46 వ ఉదు 8-21 మదు 12-26 ల |
| 5 | శ | అ మ 12-46 పున రా 10-20 ఉవ 9-54 ల 11-33 వ ఉదు 7-31 వ నవమితిథి |
| 6 | ఆ | న మ12-36 పుష్య రా10-39 ఉవ6-25 ల 8-2వ సాదు4-30ల శ్రీరామనవమి |
| 7 | సో | ద ప11-56 ఆశ్రే రా10-6 పవ11-20ల 12-55వ దినం 30-39 దశమితిథి |
| 8 | మం | ఏ ప10-52 మఘ రా9-52పవ10-9ల 11-43వ దినం 30-42 మత్త్రయ ఏకాదశి |
| 9 | బు | ద్వా ఉ9-20 పుబ్బ రా8-54 ఉ శేవ7-4వ తెవ3-47ల 5-18వ పదు11-35ల |
| 10 | గు | త్ర ఉ7-30 చతు తె5-29 ఉ త్తర రా7-37 తెవ3-35ల 5-6వఉదు9-56మదు2-52ల |
| 11 | శు | ○ పూర్ణి రా3-6 హస్త సా6-17 రావ1-40ల 3-20వ ఉదు8-17 మదు12-23ల |
| 12 | శ | బపా రా12-43 చిత్త సా4-32 రావ9-47ల 11-16వ ఉదు7-28వ |
| 13 | ఆ | వి రా10-14 స్వా మ2-51 రావ8-9ల 9-39వ మేషసంక్రమణము దినం 30-53 |
| 14 | సో | త సా7-51 విశా మ1-11 సావ4-56ల 6-26 పదు12-24 తిరి దు2-53ల |
| 15 | మం | చ సా5-37 అనూ ప11-39 సావ4-57ల 6-28వ ఉదు8-15 రాదు10-53ల |
| 16 | బు | పం మ3-35 జ్యే ప10-18 సావ5-57ల 7-28వ పదు11-38 పంచమితిథి |
| 17 | గు | ష మ1-49 మూ ఉ9-13 ఉవ7-41ల9-13వ సావ6-34ల8-7వ తిథిద్వయం |
| 18 | శు | స మ12-15 పూషా 8-28 సావ4-9ల5-44వ ఉదు8-16 మదు12-35 అష్టమితిథి |
| 19 | శ | అ ప11-26 ఉషా ఉ8-6 మవ12-8ల1-44వ దినం 31-7 ఉదు7-35వ |
| 20 | ఆ | న ఉ10-53 శ్ర ఉ8-12 మవ12-17ల1-55వ సాదు4-31 |
| 21 | సో | ద ఉ10-50 ధని ఉ8-45 సావ4-17ల5-57వ పదు12-22 తిరి 2-51ల [ఏకాదశి |
| 22 | మం | ఏ ఉ10-19 శత ఉ9-51 సావ4-40ల6-22వ ఉదు8-11 రాదు10-51ల సర్వత్ర |
| 23 | బు | ద్వా మ12-18 పూభా ప11-26 రావ9-54ల11-38వ పదు11-31ల |
| 24 | గు | త్ర మ1-44 ఉభా మ1-26 రావ2-40ల4-26వ ఉదు9-51మదు2-52 మాసశివరాత్రి |
| 25 | శు | చ మ3-30 రేవ మ3-46 వర్జ్యములేదు దినం 31-21 ఉదు8-10 మదు12-32ల |
| 26 | శ | ● అమా సా5-28 అశ్వి సా6-19మవ1-53ల3-39తెవ5-2లఉదు7-29వఅమావాస్య |
| 27 | ఆ | శుపా రా7-33 భర రా8-57 ఉ శేవ6-45వ సూఉ5-39 సూఅ6-17 సాదు4.33 |
| 28 | సో | వి రా9-31 కృ రా11-29 పవ10-13ల11-59వ పదు12-23 తిరి దు2-51ల |
| 29 | మం | త రా11-12 రో రా1-44 రావ4-58ల6-43వ ఉదు8-9 రాదు10-51ల |
| 30 | బు | చ రా12-32 మృ రా3-38 ఉవ7-45ల9-29వ పదు11-30ల |

## ముఖ్య పండుగలు

6. శ్రీరామనవమి. 8. వాడపల్లిర్థం. 15. గంగాంత్యపుష్కరములు ప్రారంభం.
27. నర్మదానది పుష్కరారంభము. 29. అక్షతృతీయ.

# విషయసూచిక



త్రివర్ణచిత్రము : 'పతికడనున్న మానినికి స్వర్గసమంబులు భీకరాటవుల్!'




## — శ్రీ రామాయణము : అంతరార్థము —

ఆనందమయమగు నవవర్గమను అయోధ్యా పట్టణమందు పరబ్రహ్మమను దశరథుండుకలడు. అతనికి ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి, జ్ఞానశక్తి అని ముగ్గురు భార్యలు కలరు. వారిలో జ్ఞానశక్తి అను కౌసల్యాదేవియందు ఆత్మయను శ్రీరాముడుద్భవించెను. అతడు అవ్యక్తమనే బాల్యావస్థచే, స్వస్వరూపజ్ఞానమును మరచి, అజ్ఞానమయమగు జీవాత్మయే తానని భ్రమించి, దేహేంద్రియాది ప్రపంచమందంతట నభిమానముంచి, శ్రవణమనే వశిష్ఠోపదేశముచేత మరల తెలివితెచ్చుకొని, వైరాగ్యమనే లక్ష్మణమూర్తిని వెంట బెట్టుకొని, మననమనే విశ్వామిత్రునితో బయలుదేరెను. మార్గములో పంచ మహాభూతములను పర్వతములనుగడచి, జ్ఞానమను తీక్ష్ణభావములచేత, నావరణమను తాటకను వధియించి, ఇచ్ఛయను మారీచుని సముద్రములోముంచి, వికారమనే సుబాహు ప్రముఖులగు కరకు రక్కసులను పెక్కండ్ర నుక్కడించి, దురాచారమనుశిలను కాలితోదన్ని, సదాచారమనే యహల్యను మన్నించి, ఏకాంతమనే మిథిలానగరము ప్రవేశించెను. అచ్చట శాంతమనే జనకుని మైత్రివడసి, అసూయ యను శివ ధనుస్సును విరచి ఆనందమను సీతాదేవిని చేబట్టి, తన్ను ప్రతి ఘటింపవచ్చిన మదమనే పరశురాముని భంగపరచి, మోక్షమనే సాకేత పురమునకు వచ్చినపుడు తాను జీవుడుకాడని నిశ్చయించి జీవత్యాగమను పట్టాభిషేకమును వహింపబూనెను. అట్టి సమయంబున క్రియాశక్తి అనే కైకవలన చపలత్వమనే విఘ్నము తటస్థించగా బ్రహ్మమనే దశరథునిబాసి, మోక్షమను అయోధ్యనువదలి ఆనంద

మనుసీతతో, వైరాగ్యమను లక్ష్మణునితో నడువ బయలుదేరి, చిత్తమనే సరయూనది దాటి, బుద్ధియను గుహుని యాదరణ వడసి, విక్షేపమనే మహారణ్యము జొచ్చి, తపస్సనే చిత్రకూటమునవనిల్చి, అహంకారమనే విరాధునివధించి, మనస్సనే కాకాసురుని వల యించి, సంకల్పమను కన్నుమాయించి, నిర్వికల్పమనే కన్నునిచ్చి, వీర్యమను అగస్త్యుని ఆశ్రయించి, ధైర్యమనే అస్త్రమును పరిగ్రహించెను.

తదనంతరము శూర్పణఖ అను కామమును విరూపినిగాజేసి ఆగామికర్మ లనే ఖరదూషణాదులద్రుంచి, ఇచ్ఛయను మారీచుని వంచింపగా, రాజసమనే రావణుడు డంబమనే సన్యాసివేషముతో ఆనందమనే సీతను అపహరించుకొనిపోయెను. అంతలో ఆత్మయనే శ్రీ రామచంద్రుడు విజృంభించి యిచ్ఛయను మారీచుని బరిమార్చి, ఆనంద మనే సీతనుగానక విచారమునుపొంది, వైరాగ్యమనే లక్ష్మణుడు వెంటనరుగ విపక్షమను కీకారణ్యములో విచ్చలవిడి తిరుగుచు, వివేకమను జటాయువును విమలత్వమను సద్గతి నొందించి, చింతయను కబంధుని వధించి, సంతోషమను శబరినిగాంచి, మనోవికాసమనే పూజ నంగీకరించి సిద్ధాసనమనే హనుమంతునితో సఖ్యమొనరించెను. తర్వాత సప్త విధ జన్మంబులను సప్తతాళంబుల ఛేదించి, భయమను వాలినిగూర్చి, నిశ్చయమను సుగ్రీవునికలిసి, సిద్ధాసనమను హనుమంతుని బురిగొల్పగా అతడు మోహమను సాగర మును లంఘించి, లోభమనే లంఖిణినిద్రుంచి, దుర్వాసనలనే రాక్షసులను హతమార్చి, ఆనందమను సీతను కనిపెట్టి సంకల్పమనే అశోకవనమును పాడుచేసెను.

అంతేగాక రాజసమనే రావణుని ధిక్కరించి యమమనే మహాగ్నిని ప్రజ్వలింప జేసి దుఃఖమనే లంకను దగ్ధముచేసి, మోహమనే సంద్రముదాటి మరలివచ్చి ఆనందమనే సీతయొక్క సంగతి ఆత్మకు దెలియజేసెను.

అప్పుడు ఆత్మయనేరాముడు మోహమనే సముద్రమున నిశ్చలత్వమను సేతువు గట్టి, తత్త్వమనే విభీషణుని చేపట్టి, విపరీతమనే ఇంద్రజిత్తును నెదురించి, తామసమనే కుంభకర్ణుని సంహరించి, ధైర్యమనే చాపము నెక్కుబెట్టి, రాజసమనే రావణుని యెదురించి, జ్ఞానమనే దివ్యబాణము ప్రయోగించి, యహంకారమనే అమృతకలశమును ఛేదించి, ఇంద్రియములనే పదితలలను ఖండించి, మహాగ్నినుండి పరిశుద్ధమై వెలువడిన యానందమనే సీతను అంగీకరించి బ్రహ్మమనే దశరథుని వీక్షించి, మోక్షమను అయోధ్యాపురముజేరి, జీవత్వనివృత్తియను పట్టాభిషేకమును బొంది బ్రహ్మమనే దశరథుడు తానై రాజ్యాధిపత్యము వహించెను. కేవలం బ్రహ్మ సాక్షాత్కారమందెననుట.

# తెలుగు తల్లీ!

- రజనీ కాంతరావు -

పసిడిమెరుంగుల తళతళలు,
పసిమివెలుంగుల మిలమిలలు,
గౌతమికృష్ణల గలగలలు
గుడి జేగంటల గణగణలు
మెరసి, మొరసి, మించిన శుభసమయము తల్లీ!
తరళయశోవతి! అనుపమిత రాగవల్లీ!
నీ వరసంతతి చేమోడ్పులివె తెలుగు తల్లీ!

కవిపికముల సల్లాపములు,
గాయక బర్హ్యాలాపములు,
లాస్యత్రిగ విన్యాసములు,
భాస్వత్పటహ నినాదములు,
విరిసి, మ్రోగి, పరచిన శుభసమయము తల్లీ!
సరళోక్తి మధు రసవతీ! కోమల వల్లీ!
నీ వరసంతతి చేమోడ్పులివె తెలుగు తల్లీ!

హాలికజన కలహాసములు,
శ్రామికజన మధుహాసములు,
దాస్యవిముక్త నివాసములు,
స్వాతంత్ర్య ప్రభా వికాసములు,
ఒలసి, మెలసి, చెలగిన శుభసమయము తల్లీ!
చరణార్పిత కోటిత్రయ హృత్సుమవల్లీ!
నీ వరసంతతి చేమోడ్పులివె తెలుగుతల్లీ!

—ఆల్ యిండియా రేడియోవారి అనుమతిని

# నూతన సంవత్సర తీర్మానాలు

"Many have lost their all whilst they sought to search into Things too high."

"Simple things rectified are abstract ideals half won."

పైసలు పదిలంగా వుంచుకుంటె కాసులు కొరతపడవు. స్వల్పవిషయాల్లో శ్రద్ధతీసుకుంటే మహత్తరమైన కార్యాలు సులభసాధ్యం చేసుకోవచ్చు. ప్రపంచం మరమత్తు చేయడానికి ప్రయత్నం చేద్దామనే అభిలాష తప్పకుండా వుండొచ్చు; కాని ఆ మరమత్తు మనయింటికే మొదలిడ్తే ముచ్చటగా వుంటుంది. తీర్మానాలు చెయ్యడం ఒకయెత్తు; వాటిలో శతాంశమైనా ఆచరణలోనికి తీసుకురావడం మరోయెత్తు. దీనికి యెంతో మనోనిబ్బరం, కార్యదీక్షా వుండాలి. ఆశయం ఉత్కృష్టమైనదిగదా అని ఒక గంభీరమైన తీర్మానం చేసుకున్నామా, అది కాగితంమీదే వుంటుంది; శీఘ్రకాలంలోనే పప్పులో అడుగువేస్తాము.

చిన్నచిన్న తీర్మానాలు ఒకటి తరువాత యింకొకటి చేసుకుని ఆచరణలోనికి తీసుకువచ్చి జయము గాంచగల్గితే క్రమంగా పెద్దవాటికీ, నిగూఢమైనవాటికీ చేతులు జాపవచ్చు. లేదా, పుట్టికెగురలేని అమ్మ స్వర్గానికెగిరిందన్నట్టు అవుతుంది. "నేను అబద్ధం మాట్లాడను; ఎప్పుడూ ధర్మంగానే ప్రవర్తిస్తాను" అనే మాటలు అల్పంగానూ, ఆచరణయోగ్యంగాను కన్పిస్తాయి; యీ తీర్మానాలు అంతా అనుకున్నంత సులభసాధ్యం కావు. ఏ సత్య హరిశ్చంద్రుడో అవాలి ఆచరణకు తీసుకువచ్చి జయం గాంచగల్గడానికి!

నా నూతన సంవత్సర తీర్మానాలు యివి:—ఆఫీసునుంచి యింటికి రాగానే మా ఆయన్ని యెప్పుడూ మందహాసంతో పలకరిస్తాను. (2) ముసలితనంచేత మాటిమాటికీ చిరాకుపడే అత్తగార్ని గదమక కమ్మని కబుర్లతో సమాధానపరుస్తాను. (3) నా పనిపాటల కడ్డంవచ్చి నన్ను విసిగిస్తే చంటిపిల్లవాడి చెంప వాయగొట్టక వాడిని లాలిస్తాను.—ఇది నా కుటుంబజీవితంలో ఆచరణకు తేవలసిన మూడు తీర్మానాలూ. (1) ఎవరైనా కొత్తచీర కట్టుకున్నా, కొత్తనగలు పెట్టుకున్నా వెంటనే ఆబగా "ఎంత బాగుంది, ఎక్కడ కొన్నారండీ" అని అడగను. (2) "మీ ఆయనకు జీతం యెంత? మీకెన్ని యెకరాల భూమి వుంది" అని యెప్పుడూ ప్రశ్నించను. (3) నలుగురూ కూర్చుని కులాసాగా బాతాఖానీ చేస్తూన్నప్పుడు అచ్చుటలేని ఆవిడ వంకలు దిద్దను. ఇతరుల వ్యక్తిగతమైన వ్యవహారాల్లో నేనెప్పుడూ జోక్యం చేసుకోను. ఇవి సంఘజీవితంలో నే నలవరచుకొనవలసిన మూడు తీర్మానాలూను!

ఈ వృష సంవత్సర తీర్మానాలు చాలా అల్పం, హీనం అంటారా? నేనలా అనుకోను.

—లీల.

# ★ స్త్రీ సాముద్రిక శాస్త్రము ★

## కనికలహంసి, శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవి

(గతసంచిక తరువాయి)



చిటికినవ్రేలియొక్క రెండవకనుపునందు రేఖలు విశదముగాలేక ఒకటికొకటి కలసియుండి చక్కగా కనపడకుండిన అసత్యవాదిగా నుండును.

ఈ వ్రేలి మూడవకనుపునందు రెండు నక్షత్ర గుఱుతులుండిన మానహానిని గల్గించు విధముగా మరణము సంభవించును. వ్రేలి యడుగునుండి స్పష్టమైన ఒక రేఖ ఈ కనుపులోగావరకు వచ్చెనేని బుద్ధిమంతులై విరాజిల్లుదురు. అది స్పష్టముగాక మసకగాయుండినను, ఆ కనుపునందు చిలువగురుతుండినను దొంగబుద్ధిగలవారుగా నుందురు.

మూడవకనుపునుండి మొదటికనుపువరకు ఒక గొలుసురేఖ సాగియుండిన నది తంత్రశాలియనుటను తెలుపును.

### బొటనవ్రేలు

ఈ వ్రేలు అరచేతికి చాలాదిగువను ప్రారంభమైన దయాదాక్షిణ్యము సూక్ష్మజ్ఞానముండును. ఇది అరచేతికి చాలాపైన ప్రారంభమై కురుచగానుండిన ఛాందసము, పిచ్చి చేష్టలు కలిగియుందురు. ఇది మిగత వ్రేళ్లకు దగ్గిరగా చేర్చియున్న దురాశ, లుబ్ధత్వమునుచూపును చాలా ఎడముగానున్న విశేష స్వతంత్రేచ్ఛ, అతి వ్యయమును చూపును. ఈ బొటనవ్రేలు అతి పొడవైన అతి గడుసుదనము, మూర్ఖపు పట్టుదల యుండును.

ఇది కొయ్యవలె వంగక బిరుసుగానున్న ప్రపంచజ్ఞానము, పట్టుదల, అతి జాగ్రత్త—వీటిని సూచించును.

సహజముగ వెనుకకు వంగియున్న దయ, దాక్షిణ్యం, క్షమ, కళానైపుణ్యం మొదలగు వాటిని సూచించును. అట్లుగాక వంచిన వంగునదిగానున్న అతి వ్యయమును దెల్పును.

ఈ వ్రేలియొక్క మొదటిపర్వము పొడవైయుండిన నిరంకుశత్వము, అట్టివారు ఒక చట్టమునకుగాని యధికారమునకుగాని లొంగువారుగారు. ఇది కురుచగానుండిన అధిక భావనము, సోమరితనము నిలుకడలేని బుద్ధి—వీటిని సూచించును.

ఈ వ్రేలియొక్క రెండవపర్వము అతి పొడవైన ప్రతి విషయములోను వితర్కము, పరులను నమ్మకుండుట, ప్రతి విషయములోను తప్పైనను సమర్థించుకొనునేర్పు—వీటిని తెలుపును.

దీనియొక్క మొదటికనుపు వెడల్పుగా, చదరముగానున్న చంచలము, స్వాభిప్రాయమందే నమ్మకము, పట్టుదల గలిగియుందురు. రెండవకనుపు బొద్దుగా, చదరముగానున్న మంచి తర్కశాస్త్రజ్ఞులు, సుప్రసిద్ధ న్యాయాధికారులుగా నుందురు.

ఈ మొదటి కనుపునందు ఒక నక్షత్ర గుఱుతుండిన యది చెడు స్వభావములనుగాని లేక మనోధైర్యముచేత జయము పొందుననుటగాని సూచించును. దీనిపై వెలుపలిప్రక్క మొదటి కనుపునకు దగ్గిరగా రేఖలుండిన మరణశాసనముద్వారా ద్రవ్యమువచ్చి చేరుట సూచించును. పెద్దవ్రేలి వెలుపలివైపు గోరు సమీపమునందు నక్షత్ర గుఱుతుండిన ద్రవ్యమును నాశనముచేయు గుణమును తెలుపును.




"సౌభాగ్యవతి కల్పలతకు
నెచ్చెలి!......"

చిత్రకారిణి: శ్రీమతి ఎస్. శకుంతలగారు

# శారదలేఖ

## సౌభాగ్యవతి కల్పలతకు

నెచ్చెలీ! - స్త్రీకి! స్వాతంత్ర్య విరహితయైన స్త్రీకి! దాస్య జీవియైన స్త్రీకి! పురుషుని సొత్తైన స్త్రీకి! హృదయమే లేని స్త్రీకి! మానవత్వమే అంగీకరింపబడని స్త్రీకి విద్యయా! పట్టములా! బిరుదులా! సమ్మానములా! కంకణ మర్యాదలా! ఎంత ఉదార హృదయుడగు భావ సంచారియైనను, ఎంత కలికాలమైనను, ఎంత నాగరికత పెచ్చు మీరుచున్నను, ప్రపంచ పరివర్తన మెంతగ గమనించుచున్నను, సహించుటెట్లు? స్త్రీకి వివేకముండునా! చదువువచ్చునా? వచ్చినను దానిని సద్వినియోగము చేయునా? ఒకవేళ తెలుగు చదువుమాటయేమోగాని ఆమెకు ఏ,బి, సీ డీ లే వచ్చిన పట్టపగ్గములుండునా! ఆమెకు బుద్ధి జ్ఞానములు మెందలేయుండవు. పరువు మర్యాద లేమాత్రము పాటింపదు. నీతి నియమము లేశమైన లెక్కచూడదు. ఆమె పెండ్లి ఆడనే ఆడదు, ఆడినను పెనిమిటి ననుసరించదు, అనుసరించినను గౌరవముతో చూడదు. వేలుగడించు వకీలునైనను రెవికలు, చీరలు, చేతికందించు మనును; స్నానమునకు నీళ్లుతోడు మనును; పొయ్యి అంటించు మనును; కాఫీ కాచు మనును; వంట జేయు మనును; తాను తినగా మిగిలినది అతనిని గతుకు మనును. తనకెంత సిరి సంపదలుండినను, మగడెంత సంపాదనపరుడైనను పనివారినైన బెట్టుకొనుట కామె యిష్టపడదు. పెనిమిటి చేతనే సమస్త గృహకృత్యములు నిర్వర్తింపజేయుట ఆమె అభీష్టము. అసలు చదువుకొనిన ఆడుదానిని పెండ్లాడిన పురుషునకు నోరు ఉండదు; మతియుండదు. ఆతనిశక్తి యుక్తులన్నియు మందగించి పట్టిజడుడై పోవును. కాన పురుషవరేణ్యులారా! జాగ్రత్త. ముందువెనుక లాలోచింపక చదువుకొనిన భార్యలకొఱకు సంబరాలు పడకుడు. వారిని సభలకు సమాజములకు పంపవలెనని యుబలాటపడకుడు. వారేవిధముగను ఉన్నతికి రావలయునని అభిలషింపకుడు. ఇంతవఱకు జరిగిన ఉపేక్షకే యుగయుగములనుండి స్త్రీలపై మనకుగల అధికారములు సడలబోవుచున్నవి. హక్కులూడబోవుచున్నవి. బాధ్యతలు తొలగబోవుచున్నవి. ఈ స్త్రీ యొక్క "సర్వసామ్యములునావి" అని ఏ పురుషుడుగాని యిక తన భార్యనుగూర్చి చెప్పుకొనజాలడు సుమా. స్త్రీలలో ఆ విధముగా విశృంఖలత మేరమీరి పోవుచున్నది సుమా! ఇకనైన స్త్రీ విద్యాప్రచారము నుజ్జగింపుడు. వారికి పాఠశాలలను కలాశాలలను పెట్టించుటకు ప్రయత్నింపకుడు. వారు సభలకు వెళ్లుటకుగాని క్లబ్బులలో జేరుటకుగాని సమ్మతింపకుడు. వారి విద్యావివేకాదుల నేమాత్రము హర్షింపకుడు, గౌరవింపకుడు. మఱియు మీ విద్యావివేకాదులను, వారిపై కథలను, కావ్యములను, నాటకములను, గేయములను గీతములను విరచించి అవహేళనము చేయుటకు వినియోగించుడు. స్త్రీని యే మాత్రము తలనెత్తనిచ్చినను మనకు ముప్పము వాటిల్లుట తథ్యము. వెనుక ప్రజాపాలక సంస్థలలో వారి ప్రాతినిధ్యము నేమాత్రము నంగీకరింపకుడు. చట్టసభలలో వారికి అనుకూలమగు బిల్లులేవి వచ్చినను అచ్చట అధిక సంఖ్యాకబలము మనదే గనుక వానిని గట్టిగా నెదిరించి ఓడించుడు. స్త్రీలయెడ మాతృత్వగౌరవమును, సోదరీ భావమును జూపవలయుననుట పూర్వపు విషయము. ప్రస్తుతము చేయదగినపని స్త్రీలను పరిహసించుటగాని, గౌరవించుటగాదు.

కల్పలతా! ఈ విధమగు ప్రచారము దేశములో జరుగుచుండుట నేనును గమనించుచున్నాను. స్వాతంత్ర్యవాదులనిన ప్రభుత్వము వారికున్న భయము కంటె, విద్యావతులగు స్త్రీలనిన, మగవారికి కలుగుచున్న

భయము అధికమైనదిగ కన్పట్టుచున్నది. అందువలననే స్త్రీలపై, స్త్రీ సంస్థలపై, స్త్రీ సమ్మానములపై నిందాత్మకములగు రచనలు సాగించి తమ అసూయతను ప్రకటించుచున్నారు.

ఈ ఈర్ష్యాగ్రస్తతచే, స్త్రీలయెడ సహజముగా తాము జూపవలసిన మర్యాదను విస్మరించుచున్నారు. దుష్టులగు స్త్రీలకు తగినశాస్తి చేయుచున్నామని మురియుచున్నారేగాని, యోగ్యులగు సాధ్వీరత్నముల కెందరకు మనఃఖేదము గలిగించుచుంటిమో అని యూహించుటలేదు. దుష్టమగునిట్టి భావప్రచారము వలన లలిత హృదయులగు యువకులలోనెట్టి దురభిప్రాయములు పడిపోవునో, తన్మూలకముగా ఉన్నతవిద్య నభ్యసించుచున్న బాలికల భావ్యభివృద్ధి కెట్టినిరోధము వాటిల్లునో వారు గమనించుటలేదు. నెమలికంట నీరుగారిన వేటగాని కేమినొప్పి. ఎద్దుపుండు కాకికి ముద్దా? ఇది అంతయు వారికి తమాషా, కులాసా. వారి నేమనినను మనలనేమి జేయగలరని ధిలాసా. అయినను మగవారిలో నింత అసహనము, ఆందోళనము బయలు దేరుటకు కారణము కన్పడదు. ఎన్నిమారులు లెక్కపెట్టినను మనదేశములో చదువుకొనిన స్త్రీలు నూటికిద్దరైనను లేరు. వీరిలో నామమాత్రముగా గాక బాగుగా చదివినవారు వేయింటి కొకరైనను ఉండరు. వీరిలో ఆంగ్లభాషనుగూడ బాగుగా నేర్చినవారు పదివేల కొక్కరైనను గానవచ్చుటరిది. ఆ చదువుకొనినవారందఱు పెనిమిటిచే నూడిగము చేయించుకొనువారే యనుట మానవ సహజమైన బుద్ధిలక్షణమునకే వ్యతిరేకము. ఇక ఈ కొలదిమందికొఱకై అసంఖ్యాక నారీహృదయములు చింతావ్యాకులితమగునట్లు లసంఖ్యాక విద్యార్థిక బాలికలకు ప్రబలాపకారము జరుగు చందమున రచనలుసాగించి లేఖినినేల కళంకిత మొనర్చుకొనవలయునో, దురూహ్యము. అయిననేమి, వీనికి మనము చింతింపరాదు. వారిని నిందింపరాదు. మన మహిళాభ్యుద యత్నమును విరమింపరాదు. మనము చక్కనిమార్గములో, అవక్రమైన పద్ధతిలో, వ్రేలుజూపరాని నడవడిలో మన స్త్రీ సంఘాభివృద్ధికై పాటుబడుటయే కర్తవ్యము. పై వ్యతిరేక ప్రచారమంతయు మనలో నిట్టి కార్యదీక్షను పురికొల్పుటకే సహాయపడునేని ఈ సోదరులెల్లరు మనకు మేలుచేసినవారే యగుదురు.

భావపురి
1-4-41.

మిత్రురాలు
శారద



# ★ రా జ మ కు టం

రచయిత :

శ్రీ గోవింద వల్లభపంతు

అనువాదకర్త :

శ్రీ పురాణం కుమారరాఘవశాస్త్రి

———— ముందు కథ ————

శీతలసేని కర్మచందును చంపటానికి రణజిత్తును పురికొల్పి పంపించింది. పన్నా ఉదయుణ్ణి తీసుకొని వెళ్లుతూ ఆరావళీ పర్వతప్రాంతమున డూంగరపు రాజు ఈశకర్ణుని కలుసుకొని ఉదయునికి ఆశ్రయమిమ్మని అడిగింది కాని లాభంలేకపోయింది. అక్కడనుంచి కమల్‌మీరు ప్రభువు ఆశాషాహునివద్దకు వెళ్లుతుండగా దోవలోనే కొంతమంది తాంత్రికులు ఉదయుణ్ణి ఎత్తుకొనిపోయారు.

పాత్రలు

| | | |
|---|---|---|
| 1. పన్నా | ... | ఉదయుని దాది |
| 2. ఉదయసింహుడు | ... | విక్రముని తమ్ముడు |
| 3. శీతలసేని | ... | వనవీరుని తల్లి |
| 4. వనవీరుడు | ... | శీతలసేని పుత్రుడు |
| 5. జయసింహుడు | ... | ప్రధానమంత్రి పుత్రుడు |
| 6. ఛందావత్ | ... | ఒక సర్దారు |
| 7. రాజగురువు | ... | |
| 8. బహదూర్ | ... | తాంత్రికుల గురువు |
| 9. వధికుడు | ... | |

———— ఇక చదవండి ————

# ద్వితీయాంకము

## ౧. దృశ్యము

[వనవీరుని దర్బారు. ప్రధానమంత్రి యాసనం శూన్యంగా ఉంటుంది. రణజిత్, ఛందావత్ మొదలైన సర్దార్లు వారివారి యాసనాలమీద సుశోభితులై ఉంటారు. ఒకవేపు రాజమకుటం పట్టుకుని శీతలసేని—మరొకవైపు పూజాసామగ్రితో రాజగురువు, ఇరుప్రక్కలా ద్వారపాలకులు.]

వనవీర్ :- మేవాడ్ రాజ్యశుభచింతనులు - సమస్త సామంతరాజులు-సర్దార్లు—ఈ నా పట్టాభిషేకోత్సవానికి దయచేసి ఈ సభను శోభాయమానం చేస్తున్నారు. తమ యాగమనమే మీరు నా అనుయాయులన్న సంగతి ప్రకటం చేస్తున్నది.

దేశంలో శాంతి, న్యాయం నెలకొల్పు నిమిత్తం నేను మకుటధారణ చేస్తున్నాను. ఈ కర్తవ్యము సఫలమయ్యేలాగు మీరు సాయం చేస్తారుగాక !

మేవాడ్‌లో శాంతికోసమని నేను కత్తికూడ పట్టవలసివచ్చినది, నిజమే. కాని అనివార్యమది.

నాకిప్పు డన్నివిధములా సంతృప్తికరంగానే ఉంది; కాని, మన ప్రధానసర్దారు కర్మచందు ఆసనం శూన్యంగా ఉండటము మాత్రం నన్ను ఖేదపెడుతున్నది.

ఛందావత్ :-కర్మచందు కుమారుడు జయసింహుడు తండ్రిగారి పదవికి యోగ్యాధికారి. విద్యాబలములలో, న్యాయనీతియందు, రణకౌశలమున తండ్రికి సమానుడు. ఈ ఆసనం అతనికే ఎందుకీయకూడదు ?

వనవీర్ :-నా నిశ్చయమూ అదే. రాజ్యంలో ఈ పరివర్తన కతడే మూలపురుషుడు. కాని, ఈ సమయాన అతని యుదాసీనత విస్మయజనకంగా ఉంది.

శీతలసేని :-ఈ పట్టాభిషేకోత్సవానికి అతనికే అందరికన్న ముందుగా ఆహ్వానం వెళ్లింది. కాని అతడింత వరకూ రానేలేదు.

రణజిత్తు :-జయసింహునికి మంత్రిపదవి ఇచ్చే విషయములో నా సంపూర్ణ అసమ్మతి తెలుపుతున్నాను. కారణం; అతడిప్పటికైనా వచ్చి వనవీర్ మహారాణాతో చెయి కలుపకపోవటమే. అతని కీ ఆసనం ఇవ్వకూడదు. అయినా, అతడు స్వయంగా దాన్ని స్వీకరించడు కూడాను.

శీతలసేని :-అతడు స్వీకరింపని పక్షములో మరొక యోగ్యునికే ఈయబడుతుంది.

రణజిత్తు :-(తనలో) ఆ యోగ్యుడు శ్రీమాన్ రణజిత్తే.

ఛందావత్ :-హఠాత్తుగా సంభవించిన తండ్రిగారి మృతికి జయసింహుడు చాల వ్యాకులపడి ఉంటాడు.

వనవీర్ :-ఐనా వనవీరుడాయన్ను చంపలేదే! (తెరలో ఘంటా - శంఖనాదాలు. ఆ తరువాత సుమధుర వాద్యధ్వనులు.)

రాజగురువు :-పట్టాభిషేక సుముహూర్తము సమీపించింది. తిలకధారణ చేయండి మహాప్రభూ !

వనవీర్ :-సిద్ధంగానే ఉన్నాను. (రాజగురువు వనవీరునికి తిలకం దిద్దుతాడు. శీతలసేని మకుటం శిరస్సుపై ఉంచుతుంది.)

శీతలసేని :-విద్యాధరులు పాట కానీయండి! మేవాడ్ నూతన మహారాణాకు మంగళగానం చేయండి! (విద్యాధరులు ప్రవేశించి పాట ఆరంభించబోతోన్నప్పుడు వేగంగా జయసింహుడు ప్రవేశిస్తాడు.)

జయసింహుడు :-జాగ్రత! ఆగండి! మొదట నన్నీ ఉత్సవాన్ని అమంగళపూర్ణము చేయనీయండి.

ఛందావత్ :-ఎవరు? సర్దారు జయసింహుడు!

జయసింహుడు :-ఔను, ఎవరి వృద్ధజనకుణ్ణి మీరు మోసగించి వధించారో, ఆ అభాగ్యుడే, జయసింహుడు.

శీతలసేని :-మేము వధించలేదు సర్దారు మహోదయ్ ! ఆయనపదవికి నిన్ను నియుక్తుని చేశాం.

వనవీర్ :-ఇదిగో నీ ఆసనం, నాకు మిక్కిలి చేరువనే ఉంది, ఇక్కడ నీ వాసీనుడవై మేవాడ్ ప్రజా క్షేమంకరంగా నాకు మంత్రిత్వము నెరపుతావుగాక!

జయసింహుడు :-నోరుముయ్యి! హంతకుడా! నీవు నా మనస్సును నీ సింహాసనమిచ్చికూడా కొనలేవు. నిర్దోష రక్తనదుల్ని మూడింటిని ప్రవహింపజేశావు. ఇప్పుడా రక్తాన్నే చిలికి నిన్నూ, నీ ఉత్సవాన్నీ కళంకితం చేస్తాను.

రణజిత్తు :- జాగ్రత! సర్దార్! పితృశోకంచేత నీ మెదడు సరిగ్గా పనిచేయటంలేదు. కాస్త శాంతించి మాట్లాడు మరి! నీ నోటివెంట రాజసభలో ఉచ్చరించదగ్గ మాటేమీ రావటంలేదు, జాగ్రత!

జయసింహుడు :- నోరుమూసుకో రణజిత్! నిన్నుకూడా బాగా ఎరుగుదును.

వనవీర్ :- నీకు హెచ్చరిక చెబుతున్నాను: కొంచెం ప్రాణభీతి కలిగి సంచరించు.

జయసింహుడు :- ప్రాణభీతి! నాకులేదు. అణుమాత్రమూ లేదు. ఎందుకుండాలి?

ఉదయుడి ముఖం చూచైనా విక్రముని హత్య మరచిపోయేవాణ్ణి. పితృసేవాభాగ్యము కలిగి ఉదయుని హత్యకూడ మరచిపోయేవాణ్ణి. కాని నాకు జీవితాశ కలిగించేందుకు దేన్నీ నీవు మిగిల్చలేదు. (కత్తిపెరికి) కత్తితో భయపెడతావా, వనవీర్! నీవొక పెద్ద ఘాతుకుడివే యయినా నన్నెదుర్కోలేవు. బంధింపబడిన విక్రముణ్ణి కాదు; నిద్రించుతోన్న పసివాడు ఉదయుణ్ణి కాదు; ఒంటరిగా వీధిలో నడచి వెళుతోన్న వృద్ధ సర్దారు కర్మచందును కాదు. తెలుసునా? ఈ నీ రాజ్యారోహణ తృష్ణకు ధిక్కారాన్ని నేను. నీ మేవాడ్ రాజ్యాన్నీ, ఈ కత్తినీ ఇప్పుడే విడిచిపెడుతున్నాను, (కత్తి విసరిపారేస్తాడు) బ్రతికియున్నంతవరకూ ఈ నీ పాపకథను ఆర్యావర్తములో ప్రతిమూలా వ్యాపింపచేస్తాను. బప్పారావలు పవిత్ర వంశనాశంకరుడా! నశిస్తావు. (వేగంగా నిష్క్రమిస్తాడు)

రణజిత్తు :- అనుమానమెందుకు? ఇతనికి పిచ్చెత్తి పోయింది. మనం మాట్లాడకుండా ఉండటమే మంచిదయింది. పోనీ, పీడా వదలింది.

శీతలసేని :- వాగితే వాగాడు. వీడివాగుడులో ఏముంటుంది.

విద్యాధరు లట్లా నిలవబడిపోయారేం? మీరు సుమధురగానం చేసి రాజసభను హర్షప్రతిధ్వనులతో నింపండి.

(విద్యాధరులు గానంచేస్తారు)

పహాడీకమాచ్ –

పాడండి మనకొత్త ప్రభువునకు మంగళం,  
వెలివిరిసినవి సౌఖ్య చంద్రికలు నేడు సుదినం,  
ఎంతవర కినశశితారకల్ దివి భాసిల్లునో,  
సుమనో మనము లమల భావోన్నతి వికసిల్లునో,  
అంతవర కిల శత్రుంజయుడవై పాలింపుమా!  
సుఖ శాంతి శ్రీ సంశోభితుడవై విహరింపుమా!

కీర్తి వెలయింపుమా!  
భువనమున,

భువనమున,
గగనమున
ఇది సుఖ సౌభాగ్యోదయ సమయం,
పాడండి మనకొత్త ప్రభువునకు మంగళం!

## ౫. దృశ్యము

[గుహలో కాళికావిగ్రహం ముందు దక్షిణహస్త శూన్యుడైన తాంత్రికుల గురువు బహదూర్ సింగు కాళీమూర్తికి ఆరతి ఇస్తుంటాడు. ఉదయుడు యూపస్తంభానికి కట్టుబడి వుంటాడు. అతని ముందు వధకుడు కత్తియెత్తి సర్దారు ఆజ్ఞకోసం ప్రతీక్షిస్తుంటాడు. ఇంకా అనేక తాంత్రికులు అక్కడక్కడ నిల్చిఉంటారు. అందరూ పాడుతుంటారు.]

కేదారగౌళ - త్రితాళం

అందరు:- జయ, జయ! కాళీ! స్మశానవాసిని!
పాపవినాశిని! పుణ్యప్రకాశిని!

౧

రిపుమస్తకవిచ్ఛేద కారిణీ,
చరణభక్తజన నిత్యపాలనీ
మృత్యుభయద వికటాట్టహాసినీ
మహాకాలదృఢ వక్షవిహారిణీ!

ఉదయుడు:- వ్యాకులపడె నీ సంతానము దుఃఖపీడితమై,
దయావతీ! జననీ! లేదా ఒక చూపిటుమాపై?

అందరు:- నీ మహిమ సర్వలోక ప్రసిద్ధమె
నిఖిల సంపదలు నీ చేటికలే
చురకత్తిని చేదాలిచి తల్లీ!
సిద్ధము కమ్మా జగసంహారిణీ!

ఉదయుడు:-[నిశ్వసించి] మీరందరూ కలిసి నన్ను చంపేస్తారా? అంత ఘోర అపరాధినా?

బహదూర్ సింగు:-నిస్సందేహంగా నీ రక్తంతో మా కాళీమాత ఆకలి తీరుతుంది. దేశంలో అనావృష్టి తప్పిపోతుంది. చాల రోజులనుంచీ తల్లి ఆకలితో ఉంది.

ఉదయుడు:-కాదు, కాదు, నా రక్తాన్ని ఒక్కబొట్టుకూడా ఈ పాషాణమయమాత ఆస్వాదించదు. మీరు ప్రవహింపజేసే రక్తధారలన్నీ ఈ కఠినభూతలాన మీ పాపకథంతా ముద్రించి మరీ ఆరిపోతై. విడిచి పెట్టండి, రాక్షసులారా! విడిచిపెట్టండి!

బహుదూర్:-మేము రాక్షసులంకాదు. నిన్ను బలియివ్వడంలో మాకు స్వార్థచింత యేమీలేదు. వీర కుమారుడిలాగు కనిపిస్తున్నావు, మృత్యుభయం వదలుకో. నీకు స్వర్గనివాసం లభించబోతోంది. నీ ఒక్కడిచావుతో అనేకులకు క్షేమం కలుగుతుంది. వధికుడు సిద్ధంగా ఉన్నాడు కదూ!

వధికుడు:-చిత్తం మహాప్రభూ!

ఉదయుడు:-ఆగు! ఒక్కక్షణం ఆగు!

బహుదూర్:-చెప్పు; జీవితాశమిళితం కాని యే కోరికైనా నెరవేర్చబడుతుంది.

ఉదయుడు:-నేను మిమ్మల్ని జీవనభిక్ష అడగను. ఈ కట్లు విప్పండి మొదట.

బహుదూర్:-(కట్లువిప్పి) చెప్పు. ఏమిటి నీ కోరిక?

ఉదయుడు:-(మెడలోనుంచి తాయిత్తు తీసి) అభాగిని, నాతల్లి నాకోసం వెదకుతూ నీకెక్కడేనా కనిపిస్తే ఈ ఆమె తాయిత్తు ఆమెకిచ్చి చెప్పు 'నీ కుమారుడు సుఖంగానే మరణించాడు'అని (బహుదూరు సింగుకు తాయిత్తు ఇస్తాడు)

బహుదూర్:-(తాయిత్తును గుర్తించి చకితుడై తనలో) అరె, ఈ తాయిత్తు నాదేనే! ఇతడెవరు? నా కొడుకు చందన్ కాదుగదా! ఇతని తల్లి భర్తృపరిత్యక్త పన్నా కాదుగదా!

వధికుడు:-మహారాజా! ఆజ్ఞాపించరూ?

బహుదూర్:-నీ పేరేమిటి నాయనా?

ఉదయుడు:-చందన్.

బహుదూర్:-[వధికుడితో] కత్తి అవతల పారేసి ఇతని కట్లు పూర్తిగా విప్పు.

వధికుడు:-అదేమిటి మహాప్రభూ! కాళీమాతకు కోపం రాదూ!

బహుదూర్:-(ఆసమయాన ఉదయుని కాలిబొటనవేలికి కట్టినకట్టుచూచి) కోపం రానీ, పరవాలేదు. సంతానాన్ని రక్షించుకోవాలి. అటు చూడు, ఇతని బొటనవేలు కోసుకుపోయింది; కాబట్టి యితని బలి మాతకు స్వీకారార్హ్యముకాదు. విడిచిపెట్టండతన్ని (వధికుడు, బహుదూర్ సింగు అతని కట్లు విప్పేస్తారు.

(పన్నా పాదచిహ్నా లనుసరిస్తూ అక్కడికి ప్రవేశిస్తుంది)

పన్నా:-చందన్! చందన్! ఎవరు నిన్నిక్కడికి తెచ్చారు? జాగ్రత! రాక్షసులారా! అతనిమీద ఈగ వాలినా అది మీకు శ్రేయంకాదు.

బహుదూర్:-కాదు, నిజమే. అదే పరమేశ్వరుడి యిచ్ఛకూడాను. మే మితన్ని బలినిమిత్తమే తెచ్చాం; కాని ఇప్పుడు మాత చెబుతోంది; ఈ కుర్రవాణ్ణి రక్షించమని నేనూ నాయీ అనుచరులూ (అను చరుల్ని చూపిస్తాడు; వారు చేతులు జోడించి అవనతులై ఉంటారు) సర్వమూత్యజించి, నీకు

సహాయం చేయటానికి సిద్ధమై ఉన్నాం. నీవీ కుర్రవాడికోసం వెదకుతూ వచ్చినట్టు తెలుస్తోనే ఉంది. చెప్పు నీ కోరికేమిటో.

పన్నా:-నిజమేనా? (తనలో) సంరక్షుడుగా ఉండవలసినవాడే భక్షించాడు. (ప్రకాశంగా) భక్షకుడివి నీవు రక్షించగలవా?

బహుదూర్:-తప్పకుండా. మమ్మల్ని కేవలం హింసాత్మకుల్నిగానే భావిస్తున్నావు. కాదు కాదు దయాపరులంకూడా. మాకూ ధర్మమనేది ఉంది.

(తనలో) ఈమే, ఔను, పన్నా. విషాదచ్ఛాయ లావరించి, గుర్తించేందుకు వీల్లేకుండా ఉంది. నన్ను గుర్తించలేక పోతున్నది. నేనూ ఆ ప్రసంగమెత్తను. (ప్రకాశంగా) నిశ్శబ్దంగా ఉన్నావేం?

పన్నా:-ఏమీలేదు నేనిప్పుడు కమల్ మీరు వెళ్ళాలి. నా కుర్రవాడు చాల అలసిపోయాడు.

బహుదూర్:-నీ కుర్రవాణ్ణి నా భుజంమీద కూచోబెట్టుకొని తీసుకు వస్తాను.

(ఉదయుణ్ణి భుజంమీది కెత్తుకుంటాడు)

పన్నా:-నీ దయ! (బహుదూర్ సింగుకు దక్షిణ హస్తం లేకపోవటం చూచి) ఎవరు? (లోపల, చెయిలేక వేలాడుతోన్న చొక్కా-చేయి పట్టుకుని) ఒక్కటేచెయి మీకు! గుర్తించాను. నా ప్రాణనాథుడివి, స్వామీ! ఏ మపరాధం చేశాను?

బహుదూర్:-పన్నా! పన్నా!

[ఉదయుడు బహుదూర్ సింగు భుజంమీద ఉంటాడు. పన్నా అతని పాదాలమీద వాలి పడుతుంది. ఇతర తాంత్రికులంతా ఆశ్చర్యమగ్నులై ఉంటారు. స్థిర దృశ్యము]

—తెరపడుతుంది—

# కుసుమగీతి

ఆ ప్రశాంత వసంత దినాంతమందు
నవ నవోన్మేషణ శ్రీని సవదరించి
మృదు మధూలికా తల్పమ్ము పదిలపఱచి
మధు మరంద సౌరభముల మలయఁజేయు

రమ్య సౌందర్య లావణ్య రాశియైన
అమర సుమ సౌకుమార్యంబు ననుభవింప
కేల నైరాశ్య మొందెదు భృంగరాజ?
హేయమౌనె సుధాపాన మెవరికైన!

కోమలములైన రేకులు కోలుపోయి,
పట్టువలె నొప్పు పుప్పొడి పట్టిపోయి,
కమ్మ పూఁదేనె నెత్తావి కగ్గిపోయి,
వన్నె చిన్నెల తీరెల్ల విన్నఁబోయి,

వాడి, వత్తయై బొత్తుగా వాలిపోయి,
నవయు పువుమీఁద నీవింత నసువుఁజెంది
జమలి ముక్కాలి రాయఁడా! చనదవేల?
ఎండమావులలోన నీరుండునయ్య!

—శ్రీ వారణాసి వేంకటేశ్వరులు

# హిందూస్త్రీలు - ఆస్తిహక్కు

యం. వి. కృష్ణరావు బి. ఎ., (ఆనర్సు)

హక్కులు' వ్యక్తిత్వాన్ని పెంపొందించటానికి ఏర్పడ్డాయి. హక్కులు వినా జీవితం వ్యర్థం. డబ్బుకు ముడివడిన సంఘంలో ఆర్థిక స్వాతంత్ర్యం అత్యంతముఖ్యం. హిందూస్త్రీలకు ఆస్తిహక్కు లేకపోవటం దురన్యాయం. కాదండీ?

హక్కులతో పాటు బాధ్యతలుగూడా సంక్రమిస్తాయని మరచి పోకండేం!

పాశ్చాత్యదేశాల్లో పురుషుడికి తప్పనట్లే స్త్రీలుగూడా భుక్తికోసం మోటుపనులు, మానహానికరమైన పనులుచేస్తారు. మనదేశంలో స్త్రీ పురుషునిలో అర్ధభాగమనిచెబుతారు. పాశ్చాత్యదేశాల్లో స్త్రీలకి ప్రత్యేక వ్యక్తిత్వంవుంది. ఆ వ్యక్తిత్వం పురుషుడితో సంబంధించి పురుషుణ్ణి అనుసరించి ఉన్నప్పటికికూడా స్వతంత్రంగా విజృంభింప కలిగివుంది. ఆవిధంగానే స్త్రీ ప్రతిభకూడా స్వతంత్రంగా విజృంభించటానికి అవకాశం హిందువుల్లో లేనిమాట వాస్తవమే. పుట్టినప్పటినుంచి మరణించేవరకు స్త్రీ పురుషునిలో అంశమై వుండవలసిందేగాని, వేరుగా వుండటానికి వీలుపడదు. వివాహబంధములో స్త్రీ వ్యక్తిత్వము పురుషునివ్యక్తిత్వంలో లీనమవుతుంది. అప్పటినుంచి వాళ్లిద్దరు కలిసి సంఘంలో ఒక వ్యక్తిక్రింద పరిగణింపబడుతున్నారు. అట్లా లీనమవటంవల్ల తన వ్యక్తిత్వాన్ని పూర్తిగా గోల్పోయి పురుషుడికి లొంగిపోయిందని అనకూడదు. అదేవిధంగా పురుషుడుకూడా స్త్రీమాదిరి ఒకవ్యక్తిలో అంశమవుతున్నాడుకాని, అతడికి స్త్రీనివిడిచి ప్రత్యేక వ్యక్తిత్వంలేదు. ఏ విషయంలో అయినా స్త్రీ వినా పురుషుడికి, పురుషుడు వినా స్త్రీకి యోగ్యతలేదు.

హిందువుల్లో తండ్రి ఆస్తిని కొడుకులతోసమానంగా పంచుకొనేపద్ధతి లేకపోవటంవల్ల స్త్రీలకు ఆర్థిక స్వాతంత్ర్యంలేదని చాలామంది అభిప్రాయం. స్త్రీలకు వారసత్వపుహక్కు లేదనటం, ఆస్తిహక్కు లేదనటం యెంతమాత్రం నిజంకాదు. హిందూస్త్రీలు ఆస్తిమీద హక్కుదారులు కావచ్చుఅని ధర్మశాస్త్రాలు సంపూర్ణంగా ఆమోదించాయి. * 'క్రమమైన పురుషవారసులు లేనపుడు, విధవకు స్థిరాస్తిమీద జీవితాంతం వరకు అనుభవించేహక్కువుంది. చరాస్తిమీద సంపూర్ణాధికారం వుంది. కొడుకులున్నప్పుడు, తల్లులకు, కుమార్తెలకు భాగాలున్నాయి. భార్యలకు అనేకవిధాలైన ఆస్తులు లభిస్తాయి. వాళ్లు బ్రతికివున్నంతకాలం భర్తలకు ఆ ఆస్తులమీద అధికారంలేదు. వారి జీవితానంతరం అవి వారి సొంతవారసులకె చెందుతాయి. ఈసొంత వారసులలో, కొన్ని సందర్భాలలో స్త్రీలకే యెక్కువయోగ్యతవుంది.' కాబట్టి హిందువుల్లో ఆడవాళ్లకి ఆస్తిమీద అధికారంలేదనటం యెంతమాత్రం నిజంకాదు.

---

* మనుధర్మశాస్త్రం. (అ ౮_౮౩ శ్లో)

మూలంలో కుమార్తెలకు దాయభాగంలేదని స్పష్టపడినా, తరువాతను, అవివాహితకుమార్తెలకు, పుత్రులు తమతమ భాగాలనుంచి కొంత యివ్వవలసిందని మనుధర్మశాస్త్రంలో చెప్పబడివుంది. కాబట్టి కూతుళ్లకి భాగములేదనటం ఎంతమాత్రం నిజంకాదు. అయితే స్త్రీలకు యెట్టిస్థానం వున్నదని విచారించటానికి కేవలం దాయభాగాన్నిబట్టి నిర్ణయించటానికి వీలుండదు. స్త్రీలస్థితి యావత్తూ దాయభాగాన్నిబట్టే వుంటుందని కొందరు తెలివితేటలుగల పెద్దమనుష్యులు చెబుతారు. అయితే హిందూస్త్రీలకు ఆస్తిమీద యెంతహక్కు వుందో చూచుకోకుండా యిదమిద్ధమని నిర్ధారణచెయ్యటానికి సావకాశం వుండదేమో అని నా భయం.

హిందూస్త్రీలకు విశేషాధికారాలు, హక్కులుయిచ్చి ఆమోదిస్తూంటె, ఆహక్కుల్ని ఆచరణలో పెట్టటానికి సాంఘికవ్యవస్థలను తదనుకూలంగా నిర్మిస్తే, సంఘసంస్కారులం అని చెప్పుకునే శాసనసభ్యులు హిందూస్త్రీల 'దాస్యవిమోచన' చెయ్యటానికి ప్రత్యేకశాసనాలు తయారు చెయ్యవలసిన అవసరం ఏమిటి? వారసత్వపు హక్కులివ్వటం ఏమిటి? హిందూ వనితలకు శాసనాలకంటె యెక్కువ బలవత్తర మైనసత్వాలు యిస్తున్నట్లు మన సంఘనిబంధనల ఆచరణ యెరుగున్నవాళ్లకి తెలుస్తుంది.

ఎట్టి పరిస్థితుల్లో అయినా స్త్రీలను పోషించవలసిన బాధ్యత తండ్రి, అన్నదమ్ములు, కొడుకుల మీద ఉన్నది. చనిపోయేటప్పుడు తండ్రి, కొడుకులకేమి యివ్వకపోయినా, తల్లిని జీవితాంతంవరకు తగురీతిని పోషించటానికి కొడుకులు బద్ధులు. పిత్రార్జిత ఆస్తి సంక్రమించినా లేకపోయినా అక్కచెల్లెళ్లకు పోషణ యిచ్చి, పెళ్లిపేరంటాలుచేసి, శుభకార్యాలలో బహుమతులు యివ్వటం వంతు అన్నతమ్ములది. పండుగలు వచ్చినా, శుభకార్యాలువచ్చినా ఆడపడుచులకు, కూతుళ్లకు యెన్నో అధికారాలున్నాయి. ఒక్కొక్కప్పుడు ఆడపడుచులదే పెత్తనం. పెళ్లిఅయిన తర్వాతకూడా ఆడపడుచులకి పుట్టింటివారినుంచి నిరంతరం కానుకలు వస్తూనేవుంటాయి. హిందూసాంఘిక సాంప్రదాయల్ని అనుసరించి ఈ కట్నాలు, లాంచనాలు, కానుకలు వారికి తప్పనివి.

మనపద్ధతులు, సాంప్రదాయాలు మంచివే; వాటిని సదుద్దేశాలలో నేర్పరచారు. అయితే అవి ఆచరణలో యెంతవరకు నెరవేర్చబడుతున్నాయి అన్నసంగతి మనం కొంచెం విచారిస్తే తప్పకుండా ప్రతివాడికి కొంత విచారంకలుగుతుంది. మనకు తెలిసో తెలియకుండానో మొత్తంమీద మన సాంప్రదాయ వ్యవహారాలకు స్వస్థిచెప్పుతున్నారు. పాశ్చాత్య విద్యనభ్యసించి, ఉద్యోగాలు చేస్తున్నవారిలో చాలామంది మన శాస్త్రాలు విధించిన విద్యుక్త ధర్మాలని సరిగా నెరవేర్చటంలేదనే నానమ్మకం. 'కట్నాలు, కానుకలు వగైరాలేమి యివ్వకూడదు; పుచ్చుకోకూడదు;' అని ప్రచారంచెయ్యటానికి కొందరు మహిళామణులు ఈ మధ్య ఒక ఉద్యమాన్ని లేవతీసి పత్రికాముఖాన చాలాప్రచారం చేశారని వినికిడి. మనవిశిష్ట ఆచార వ్యవహారాలకి స్వస్థి చెప్పటానికి కారణం పాశ్చాత్య విద్యనేర్పిన స్వార్థపరత్వం తప్ప మరేమి కనబడలేదు. ఇప్పటికైనా హిందువులు వెర్రిగా పాశ్చాత్యుల దుర్గుణాలని మాత్రమే నేర్చుకొని, మన ధర్మశాస్త్రాలకు బూజెక్కనివ్వరని నా నమ్మకం. మన దేశంయొక్క నాగరికత, మన జాతియొక్క ఆధిక్యత, మన జాతియొక్క పవిత్రత మన గృహలక్ష్ములమీద ఆధారపడి ఉన్నదనుట నిశ్చయం.

# ★ శూన్యహృదయుడు

అతడటులుండుటకు కారణము ?
బాల్యవివాహమా ?
సంఘదోషమా ?
ప్రేమించి పెండ్లి చేసుకోనందుకా ?
లేక ఆమె దురదృష్టమా ?

శ్రీమతి టి. వి. రత్నవల్లి

ప్రొఫెసర్ కృష్ణారావుగారు తన ఏకైక పుత్రిక కమల ఐదవ తరగతి చదువుచుండగా పదవయేటనే 5 వేలు కట్నమిచ్చి వివాహము గావించెను.

కమల చామనచాయ. ఆమె విశాల నేత్రములు, ప్రేమ విహీనులనుగూడ ఆకర్షింపజేయు ఆ అమాయకపు చూపులు నీటిలోని చేపలవలె మిరుమిట్లు గొల్పుచున్నవి. ఆమె సరళ హృదయురాలు. ఆమె అతి చురుకుగలది గాదు. అతి నెమ్మదియైనదియు, దీర్ఘాలోచన పరురాలూనూ. ఆమె ఎప్పుడును గట్టిగా నవ్వి ఎరుగదు. ఎల్లప్పుడున్నూ ఆమె ముఖపద్మమున చిరునవ్వు చిందులు త్రొక్కుచుండును. అప్పుడే వికసించిన గులాబిపువ్వువలె నుండు ఆమె కోమలహస్తములు వీణ మీటునపుడు ఎంత నలిగిపోయెడివో!

నేటివరకు కృష్ణారావుగారింట్లో చింతకు తావులేదు. కాని, కాలచక్రమెప్పుడూ ఒక్కలాగుంటుందా! అల్లుని సంగతి అతని కెంతమాత్రము నచ్చలేదు. ఆ కఠినాత్మునితో తనపిల్ల ఎటుల కాపురము చేయునా యని విచారము. కాని, కృష్ణారావుగారు కమలను ఎన్నేండ్లు ఇంట నుంచుకొందురూ? ఆఖరుకి కమల మెట్రిక్యులేషన్ ప్యాసైన యేడు 16-వ యేట ఊరివారి బాధవల్లైతే నేమి, ఎలాగైతేనేమి, అల్లుడు సెలవులకు ఇంటికి వచ్చియుండుననుఉద్దేశ్యముతో కమలను అత్తవారింటికి పంపివేసెను.

కమల అత్తవారివూరు శుద్ధ పల్లెటూరు. కమల పట్నవాసపుపిల్ల. అందువలన కమలకు ప్రతి విషయముకూడ క్రొత్తగను, వింతగానూ కనుపించెడివి. ఆమె అతి నాజూకుమంతురాలవుటచే ఆమె కందరును మోటుగా కనుపించిరి. వారు కట్టుకొను గుడ్డలు, ధరించు నగలు, చేయుపనులు, ఆడు మాటలు ఆమెకు విచిత్రముగా నుండెడివి.

కమల అత్తవారి ఇల్లంతయు మట్టి ఇల్లే. వారు దానిని రోజు పేడతోఅలికి ముగ్గుపెట్టెడివారు. తొమ్మిదిగంట్ల కందరును చద్దిఅన్నము తినెడివారు. వారింట్లో వంట సరిగ్గా పన్నెండుగంటలకి.

కాని, అత్తవారింట్లో ఎన్ని కష్టములున్ననూ, వాటిని సహర్షముగా సహించుటే సెలతుల లక్షణము. అదియే వారి సహజనైపుణ్యము కమల కూడ అట్టివారిలో చేరినదే. చాల ఓర్పుగలది.

రోజులు గడచి పోవుచున్నవి. సగము సెలవులు గడచి పోయినవి. కానీ, కమల భర్త నరసింహుడు సెలవులకి ఇంటికి రాలేదు. అతను స్కూల్ ఫైనలు మూడో సంవత్సరము ప్యాసైనాడు. ఇప్పుడు ఇంటర్ సీనియర్ మూడవయేడు కూడా పోయింది. తర్వాత ఇంటికి వచ్చాడతను.

ఎందుచేతనో తెలియదు కమలకు ఇచ్చటికి వచ్చిన పదునైదు దినములనుండి కొద్దిగా జ్వరము తగులుతూంది. ఆమెకు బెంగయో, తలిదండ్రులువద్ద లేరను విచారమో, వేళకు తిండిలేకనో ఎందువల్లనైతే నేమి దినదినమునకు జ్వరం ఎక్కుతూనే వుంది. జ్వరమువచ్చిన పదునైదు దినములకు మెల్లగా వాళ్లవాళ్లకు ఉత్తరం వ్రాసాడు ఆమె మామగారు.

ఇంకేముంది సర్వస్వము కమలయే కృష్ణారావుగారికి. అందువల్ల మర్నాడే హాజరైనారు కృష్ణారావు దంపతులు. జ్వరము ఇంకా ఎక్కువై డబిల్ నిమోనియాలో దింపింది. జ్వర మెక్కువైన కొద్దీ కృష్ణారావు గారికి ఆవేద నెక్కువైంది. ఇంటివైద్య మాయనకు సరిపడలేదు. తక్షణమే హాస్పెటల్లో చేర్చారు. కృష్ణారావు గారు ఆయన భార్యకూడ కడుపుకు ఆహారము కంటికి నిద్రలేకుండ 24 గంటలు రోగి శుశ్రూష చేయుచుండిరి. కాని, అత్తమామలు ఎటులనుందని కూడా అడిగేవారుకారు. సరి, భర్తనడగనే అక్కర్లేదు. అత్తమామలు వారానికి ఒకసారైన లోకులబాధలు పడలేక వెళ్లేవారు. కాని, భర్త అదీలేదు. ఒక్కసారైనా వెళ్లలేదు. ఉత్తమూఢుడు. ఆహా! ఎంత కఠినాత్ముడు!! ఏమి అతడు అందరివల్లె అగ్నిసాక్షిగ పెళ్లి చేసుకోలేదా!!! అతడు కేవలము కట్నాన్నే పెళ్లిచేసుకున్నాడు. మామగారివద్దనుండి డబ్బులాగుచునేయున్నాడు. అతనికి పాషాణ హృదయము. కాకున్న అట్లుండగలడా! వీధిలోపొయ్యే బిచ్చవానికి కూడ దెబ్బతగిలిన మనస్సు నిలువదు గదా! అటువంటిది తన్నే నమ్ముకొని తన్నే సర్వస్వము ననుకొను భార్యను తన కిష్టములేక పోయినను సరే ఒక్కసారైనను చూడవద్దా! అసలు తనుభార్య వచ్చేక ఆమెతో మాట్లాడే ఎరుగడు. అంత చక్కనిది చదువులకుప్ప సద్గుణవతి వానికెటుల కన్పెడెనో దైవమున కెరుక.

అతడటులుండుటకు కారణము?...బాల్యవివాహమా?...సంఘదోషమా?...ప్రేమించి పెండ్లి చేసుకోనందుకా? లేక ఆమె అదృష్టమా? ఎవరికి తెలుసు భగవంతుడే ఎరుగు. కమలలోలోన కృశించు చున్నది భర్తకు తనపై ప్రేమలేదుగదాయని.

మర్నాడు ఆమెస్థితి బొత్తుగా బాగులేదు. నాడి చేతిలో గంటలకొద్ది వెతికిననూ కనుపడలేదు. చూపుకూడ మారింది.

సాయంకాల మారుగంటలైంది. సూర్యుడస్తమించాడు. అప్పుడే కమల కొంచెం కళ్లువిప్పి చూచింది. ప్రక్కన తల్లికూర్చుంది. ఆమె కళ్లువిప్పి నాల్గువైపుల కలియచూచింది. కాని, ఆమె అదృశ్య దృశ్యమును వీక్షిస్తూంది. కొంచెము సేపటికి ఆమె 'అమ్మా...అమ్మా'యని పిలిచింది. 'ఏమమ్మా ఏంకావాలీ, ఎందుకలా చూస్తావు?' అని తల్లి నెమ్మదిగా దగ్గర మంచంమీదకూర్చుంది. కాని, ఆమె చూపుకు అంతు లేకుండావుంది. ఆమెకు రెండుదినములై చూపు మారినప్పటికీ ఆమెచూపు వేటినో తదేకదృష్టితో వీక్షించు చున్నది.

ఆమె తల్లినిచూచి నెమ్మదిగా 'అమ్మా...నాకు పెండ్లి ఎందుకుచేశావమ్మా...నేను సుఖపడతా నేమోననా?...వారికి నామీద అంతపగ ఏమమ్మా......అమ్మా! నా కండ్లు మూతలుపడుచున్నప్పటికి... వేటినో వీక్షిస్తున్నాయి' అని నెమ్మదిగా అనెను.

'అవును తల్లీ గ్రహించితిని. ఏమి చేయుదును?...అతడు...శూన్యహృదయుడు'అని తల్లి కన్నీరు కార్చినది....ఆ మాటవినగానే ఆమె తుదినిద్రలో లీనమైపోయింది........

# లక్ష్మీశారదా నవరత్నహారము



క॥ శ్రీ లలితంబగు కేసరి । యాలయమున జననమైతి
వమ్మా! సుమనో! ల్లాలసవౌ గృహలక్ష్మీ! । మేలుంగ వర్ధిల్లుమింక—మించిన ప్రభలన్ ॥

సీ॥ కవితాలతా ప్రౌఢి గల్పించి యెవ్వాణి తన విహారంపు నీ మనుచు దిరుగు
భారత భాగవతా రహస్యంబులన్ బ్రకటించె నెవ్వాణి పండితులకు
నవరస శృంగార నటనాధురీణతన్ గల్పించెనెవ్వాణి కల్పకముగ
సంగీత సాహిత్య సకలకళానంద మేమాత పూరించె నెలమితోడ

గీ॥ అట్టి గీర్వాణి కలవాణి అమలవాణి ఆంధ్ర మహిళామణీలోక మమరియున్న
కేసరికృతదివ్యేందిరా గేహమునను జెలగుగావుత మంగళా శీస్సులొసగ !!

మ॥ తెనుగుందల్లికి నోముపంటవయి యుత్తేజాన్విత జ్ఞానివై
ఘన సౌభాగ్యము లొందుచున్ సరస సద్గ్రంధాను రూపమ్మునన్
వనితాలోకము నుద్ధరించితివి నవ్యప్రౌఢి బాసిల్ల మిం
చిన కల్యాణములొంది తమ్మ గృహలక్ష్మీ పత్రికారత్నమా !

మ॥ వరపాండిత్య ధురీణతా గరిమ, విస్ఫారోరు తేజమ్మునన్
గురు నాశీఃకలనా విశేషమున సద్గోష్ఠి ప్రచారంబులన్
బరమార్థంబు గ్రహించి భామినుల సుస్వాంతమ్ములందన్పుచున్
జిరకీర్తిన్ బ్రకటింపుమమ్మ గృహలక్ష్మీ పత్రికారత్నమా !

సీ॥ మాతృభాషాసేవ మరువని యిల్లాండ్ర నాశీర్వదించుమా యనవరతము
నవ్యభాషాకల్ప నారూఢవతులకు స్వాగతం బొసగుమా సరసమతిని
ప్రాజ్యవిద్యా యశోరమణుల కెల్లప్పుడాశ్రయం బొసఁగుమా యాదరమున
కాంతాకవిత్వ స ద్గౌరవోన్నతి నిల్ప గంకణాల్గట్టు మా ఘనతమీర

గీ॥ కలిమి జవరాలు కూర్మిని గన్నబిడ్డ
కేసరికి ముద్దు బిడ్డవై వాసి గనుట
నానరనేటేట జన్మ దినోత్సవముల
జరుపుకొనుమిల్లై ధరలోన శాశ్వతముగ

మ॥ పదుసాగ్లేడుల బాలప్రాయమున నే భాషావధూటీకృపన్
బదలాలిత్యము నవ్య పాకకళలున్ భాగ్యోన్న తాపత్రముల్
ముదమారంగగడించి నావనగ నీ పుణ్యక్రమం బెట్టిదో
విదుషీరత్నము లెందఱో సతము నిన్ వేనోళ్ల గీర్తింపరే!

మ|| కవయిత్రీ తిలకమ్ము తెందటో మహోత్కంఠాను రాగమ్మునన్
సువిశాలోన్నత భావడోలికలనిన్ శోభిల్లగా నూపగా
భువి బెంపొంది మహోన్నతాపదవులన్ బొల్పారగా నొందుచున్
ధ్రువకీర్తిన్ వెలుగొందగావలె సుమా తోరంపు ధీశక్తులన్

ఉ|| హారము నిచ్చితిన్ సుమ సమంచిత నిర్మల సూక్తి మూక్తి కా
హారము అంచితాశయ విహారము ధర్మనికుంజమంజరీ
హారము ధూర్తవాద పరిహారము భవ్యకళాకలాప వ్యా
హారము గొమ్మ! అస్మదుపహారము నీ నవరత్నహారమున్||

సీ|| సంఘసేవాదీక్ష సాధింపగలయట్లు సాధ్వీమణి వటన్న జాలుదీవె
ఆంధ్రయువతీ సంస్కృతాంధ్ర కళాశాల నడిపింపగాజాలు పడతివీవె
ఉభయభాషా ప్రవీణోన్నతిన్ గాంచిన విదుషీ తిలకమటన్న ముదితవీవె
కంచికామాక్షి పేర్మించగ కామాక్షి వన ఖ్యాతిగాంచిన యతివవీవె

గీ|| మేలు మేలని బుధులు నిన్ మెచ్చుకొనగ
సతత విద్యాభి లాషివై సద్యశమ్ము
బడసి భాషావధూటికేల్ బట్టినావు
ఘనత నపరంజి రత్న కంకణము గొనుమ||

బాపట్ల
20-2-41

శ్రీమతి గిడుగు లక్ష్మీకాంతం

ఇతర మానవులను ద్వేషించడంవల్ల సోదరభావం కలుగదు. పరస్పర కలహాలవల్ల సంఘీభావం కలుగదు. విభేదాలవల్ల ఐకమత్యం కలుగదు. ధనం, సంతతి, భోగం మొదలైన కోరికలవల్ల శాశ్వత సౌఖ్యం మానవులకు కలుగదు.

♦ ♦ ♦

సహనం, సత్యం, యివి యువకులకు ముఖ్యంగా వుండాలి. జయం సత్యానికే కలుగుతుంది గాని అసత్యానికెన్నడూ లభింపదు.

—సర్. రాధాకృష్ణ.



“పూలోయమ్మ పూలు!

రోజాలు, సన్నవిరజాజులు...”

# మదన మోహాన విద్యాలయం, ఢిల్లీ



ఢిల్లీలో ఒక పెద్ద సంగీతసభ జరిగింది. వివిధ విద్యాలయాల వారూ సంగీతపోటీలలో పాల్గొని మహాసభను జయప్రదం గావించారు. మదనమోహాన విద్యాలయం స్త్రీలు తపలా వాయిద్యంలో మంచి నేర్పుచూపి ప్రథమ బహుమానం పొందారు.

# అమ్మ

శ్రీమతి భాగవతుల బుచ్చమ్మ



'అమ్మా, అమ్మా' యనిపిల్చాడు అనంతం పరిగెత్తుకొనివచ్చి. తోముతూవున్న పళ్లెమునువిడిచి పెట్టి 'ఏలనాయనా? ఇంతవేగంగా వెళ్లిపోవచ్చినావేమిటి? యివాళస్కూలుకు సెలవాయేమిటి?' అంది భారతి విస్మితురాలయి.

'కాదే అమ్మా, గురువుగారు నాలుగణాలు తెచ్చుకోమన్నారు.'

'ఎందుకు తండ్రీ?'

'అమ్మా నీకేమి తెలియదే. రేపు గణపతి పూజకదూ! రెండణాలు ప్రసాదానికి, రెండుఅణాలు గురువుగారి దక్షిణకు.'

'నాలుగణాలు యెక్కడనుండి తేగలను నాయనా?'

'బాగుందే, తోడి పిల్లలంతా యిస్తూవుంటే నేనెలా యివ్వకుండా వుండను? రామేశం రెండు రూపాయిలిచ్చినాడే.'

'వాడు లక్షాధికారి బిడ్డడు. మనము చాలా బీదవాళ్లము. పైసాయెక్కడనుండి వస్తుందిమనకు?'

'దక్షిణయివ్వనివాళ్లను పూజకురానివ్వనని గురువుగారు చెప్పినారు.'

'సరే, రేపుకదాపూజ. సాయంత్రములోపుగా రెండణాలు చూస్తానులే.'

'అయితే మరిప్రసాదానికో?'

'ఇవ్వకపోతే మానివేయని. నీవునునేనుకలసి యింటిలోపూజచేసుకొని తిందాము.' అంది భారతి బుజ్జగిస్తూ.

'అక్కడయితే పణోడీలు, లడ్డుండలు, జిలేబీలు యింకా యెన్నెన్నియో దొరుకును. నీతో అయితే పూజచేసిన పిదప పప్పూ అన్నం తప్ప మరేమియునుండదు.' అని అనంతం చిన్నమొగము వేసుకొన్నాడు.

భారతికి నలుదిశలు యంధకారమయముగా గోచరించినది. పాపం పరిస్థితి యటువంటిది. ఎట్టి కష్టములను గట్టెక్కుచు యెటుల యెనిమిది వత్సరములు గడపినదో యాభగవంతునికయినను తెలియదు. అనంతం జన్మించిన కొద్దినెలలపిదప భార్యాభర్తలకేదో పట్టింపుమాటవచ్చినది. ఆమఱుచటి యుదయముననే గోపాలం యంతర్థానమయినాడు. పన్నెండు, ఒంటిగంటవరకు అన్నము మూతబెట్టి భర్తకోసము కనిపెట్టుకొని కూర్చుంది. ఇప్పటికిరాలేదు, అప్పటికిరాలేదు గోపాలం. ఎక్కడకుపోయినాడో తెలియదు. ఇక నేముంది? ఇంటిలో యెవరికీ భోజనాలులేవు. భారతి నెత్తీ వాయికొట్టుకొంది. ఎవరితో చెప్పి యేడుస్తుంది? వానిని వెదకే దాతయెవరు? సాయంత్రం అయినది. వానిజాడలేదు. బయట ఘోరముని వర్షము కురియుచుండెను. ఇంటిలో భారతికన్నీటివర్షం. ఆమెజీవనాధారం ఆతడే. ముష్టియోనష్టియో యెత్తి నాలుగుడబ్బులు సంపాదించెడువాడు. ఏవిచారములేకుండా యామె కూర్చుండెడిది. కానియిప్పుడో?

ఇంటిలో యేముంది? నాలుగుడబ్బులు సంపాదించుటెటులు? నాలుగు అణాలు అంటే నాలుగు లక్షలవలె కనబడుతుంది. కాని చిన్నబోయిన పిల్లవాని ముఖమునుజూచి యామె సహించలేక పోయింది. ఓదాత మీద యాశఁబెట్టుకొని కుమారునకు మాటయిచ్చింది. భరింపరాని తల్లియావేదన శిశువు అనంతమునకు యేమి తెలియును? పాపం, యేమి తెలుసుకొనగలడు? ఇంతలో స్వాధ్యాయులు, 'ఒరే అనంతం, వేగమురారా' యని కేకలు వేసినారు.

'వస్తున్నాను, ఉండండి. అమ్మా, వేగము డబ్బియ్యవే. వాళ్ళందరు వెళ్లిపోవుచున్నారు' అనంతం తొందరపడుచూ యనెను.

భారతి యుపేంద్రుని బిల్చి 'అబ్బాయీ, నావద్ద యిప్పుడొక చిల్లిగవ్వయైనను లేదు. రేపు పూజవేళకు యే తాపత్రయముపడియైనా సొమ్ము పంపెదనని మీ గురువుగారితో చెప్పుమ'ని యంది.

బాలురంతా వెళ్లిపోయారు. చాలా దినములనుండి యింకిపోయిన దుఃఖాశ్రువులు మరల భారతి నేత్రములనుండి స్రవింపసాగెను. ఎక్కడనుండి పైకముఁదెచ్చి కుమారుని యవమానముఁ దప్పించగలదు? గురువుగారికి దయాదాక్షిణ్యములుండవా? వానిమాట నాలకింపరా? గురువుగారా గ్రామస్థుడయిన ఆమె వాని కాళ్ళమీద పడవలసినదే. కాని పరాయివాఁడు. పాపం, యింటిలో నొకమూలఁగూర్చుండి యేడ్చుట కయినను యామెకు వ్యవధిలేదు. గుండె రాయిజేసుకొని గ్రామములోనికి బయలుదేరింది యేమయినా యాధారముగాని, యే మహానుభావుని దయగాని ప్రాప్తించునేమోయని.

◆ ◆ ◆ ◆

భారతి గ్రామమంతా వేటాడింది. ఒకడు బట్టలు కుట్టించెదనని యాశబెట్టాడు. మరొకడు యామెచేతనే ధాన్యము దంపించెదనని వాగ్దానమిచ్చాడు. కాని యామెకొక చిల్లిగవ్వయినా దొరకలేదు. కడసారి యాశ యొకనిపైఁబెట్టుకొనినది. అతను గ్రామమునకు రెండుమైళ్లదూరములో ఉన్నాడు. ఆయన తప్పక యిచ్చునన్న యాశపెట్టుకొంది. ఆమెకాళ్లీడ్చుకొనుచు యామహానుభావుని యింటికి బోయింది. ఆయన నాలుగయిదు దినములక్రిందట తన కుమార్తె యింటికిఁబోయియున్నాడు. రిక్తహస్తములతో భారతియింటికి బోవలసివచ్చింది. ఆమెగుండెలు దడదడ కొట్టుకొనసాగెను. కాలము వ్యర్థమయి పోతూంది. త్వరగా గృహమునకుపోవనిచో అనంతం ఆమెకొరకు వేచియుండును. ఎంతయాశపెట్టుకొని నిరీక్షించుచుండునో పాపం? వెళ్లిన తోడనే పైసా కొరకుగెంతులు వేయును. ఏమిబోధపర్చివానిని యోదార్చగలదు? గర్భదరిద్రులన్నసంగతి వాని కెటుల తెలియును?

అనుకొన్నప్రకారము యక్షరముల జరిగింది. తల్లిని చూచినతోడనే అనంతం పరుగు పరుగున వచ్చి చీరకొంగుపట్టుకొని 'అమ్మా! డబ్బు తెచ్చావా? ఏదీ?' అన్నాడు.

'పదనాయనా రేపుకదాపూజ. రేపు తప్పకయిస్తానులే.' యనినచ్చచెప్పింది.

ఝామురాత్రినుండి పనిచేసింది. ఆఖరకు ఆమెకు దొరికింది శేరుబియ్యము మాత్రమే.

ఉదయము యెనిమిదిగంటలయింది. పిల్లకాయలంతా పువ్వులు గోయుటకు బయలుదేరారు. కొందరు చెఱువునకుపరుగెత్తారు. ఆదినమున వారియానందమునకు మేరలేదు.

తోడి పిల్లకాయలమధ్య యెంతసేపో అనంతం యుండలేకపోయాడు. పైసాకొరకు పరుగుపరుగున యింటికివచ్చాడు. పైసా యివ్వకుండ యేముఖము పెట్టుకొని వారివద్దకు బోగలడు?

కుఱ్ఱవాళ్లంతా జట్టుజట్టులుగా మంచిమంచివస్త్రములను ధరించి గణపతిపూజకు వెడుతూ,

'ఒరే అనంతం! పూజకు రావురా?' యని కేకేశారు.

'ఆగండి, మా అమ్మ వస్తుంది'

కడసారి ప్రయత్నమునుగూడచేసి భారతి యింటికివచ్చింది.

'అమ్మా, వేగం పైసా యియ్యవే. అందరు వెళ్లిపోతున్నారు' అన్నాడు అనంతం.

భారతికండ్లనుండి జలజలమని నీరుకారింది. పైకి కనబడకుండా చీరకొంగుతో కండ్లుతుడుచుకొని 'నాయనా, చాలప్రయత్నముచేశాను. ఒక్కదమ్మిడీ అయినాదొరికిందికాదు. ప్రసాదముకొరకు కావలసిన రెండుఅణాలు తెచ్చేందుకు ప్రసాదరావును బంపితిని.

'అయితె గురువుగారి దక్షిణమాటయేమి?'

'శేరుబియ్యము తీసుకొనివెళ్లుము'

'గురువుగారు డబ్బుతీసికొనిరమ్మన్నారు. బియ్యమేమి చేసుకొంటారు?'

'గురువుగారు మాత్రము డబ్బుయిచ్చేగదా బియ్యముకొనాలి? శేరుబియ్యముఖరీదు రెండు అణాలు. శేరుబియ్యమే యిచ్చేయి.'

బాలుడు యెట్టకేలకుసమ్మతించెను. కాని మనస్సులో ప్రాణము కొట్టుకొనిపోతుంది. అందరు యిచ్చింది డబ్బులు తానుయిచ్చేది బియ్యము. మానావమానాలుమరచి అనంతం పూజచేయుటకు పరుగు పరుగునవెళ్లాడు.

బియ్యముతోనున్న పళ్లెమునుజూచి గురువుగారుమండిపడిరి. పళ్లెమును దూరముగావిసరివైచి 'నేనేమి ముష్టిముండాకొడుకు ననుకొంటివా? ముష్టివేయుటకు పిడికెడు బియ్యముపట్టుకొనివచ్చితివి. ఈబియ్యమునకు నిన్ను పూజచేయనిస్తా ననుకొంటివికాబోలు? ఫో అవతలకు' యనికేకలు వేశారు.

అనంతం నిలువున నీరయి పోయి సిగ్గుచే తలవంచుకొని యొక మూల నిలబడినాడు 'అమ్మకు నామీద యిసుమంత ప్రేమయైనాలేదు. లేకపోయిన రెండు అణాలు యివ్వలేదాయేమి?' యని యనుకొన్నాడు. పిల్లవాళ్లు గుంపులు గుంపులుగా వచ్చి గణపతికి పూజ చేస్తున్నారు. అనంతం హృదయములో ప్రచండ వేదన జ్వాలలు ప్రజ్వరిల్లసాగాయి. బాలుర యొకరి తర్వాత నొకరు గణపతి మీద పూలుచల్లుతూంటే, పాపం! అనంతమునుమాత్రం పూజకు రానిచ్చుటలేదు. ఏమిచేస్తాడు? కిటికీ గజములను బట్టుకొని సిద్ధిగణాధిపతిని విలోకిస్తూ నిల్చున్నాడు. ఇంతలో నొక ధనవంతుని బిడ్డడు రమేశం పరుగెత్తుకొని వస్తూవుంటే వాని తల అనంతంతల డీకొన్నవి. రమేశం మొర్రోమని యేడువసాగాడు—గురువుగారికి కోపము అగ్గిమీద గుగ్గిలమయింది. పూజ విడిచిపెట్టి బెత్తంపట్టుకొనివచ్చి 'ఏమయిం'దని రమేశును యడిగాడు. 'అనంతం బుర్రతోగుద్ది వేశాడండీ'యని యేడుస్తూ చెప్పాడు రమేశం.

పాపం అనంతం యెక్కడికి పోగలడు? రెండణాలు చెల్లించుకొన్నప్పటికి పూజచేయుటకు స్థానము లభించుటలేదు. గురువుగారు రోష కషాయిత నేత్రులై 'చూస్తే గుంట వెధవవు, చేసేపనులు పందికొక్కు చేష్టలు. ఏమిరా నీకుపోయేకాలం? వానిని బుర్రతో యెందుకు గుద్దితివని బలమైన దెబ్బలుకొట్టి అక్కడ నుండి వానిని తరిమివేశారు.



అనంతం శరీరమంతయు కంపింపసాగెను. తల్లి యొడిలోబడెను. భారతి అనంతం బుగ్గలను ముద్దులాడి చిబుకమునుబట్టుకొని 'ఏమి జరిగింది నాయనా'యంది

'నాలుగణాలు' యనిగద్గద కంఠముతో అన్నాడు.

'ఉండిన యివ్వకపోదునా? పూజచేశావుగదా, ప్రసాదము మనము చేసుకొని తిందాం'

'పూజ మాత్రమెక్కడ జేసితిని? పట్టుకొని వెళ్లిన బియ్యమును విసరివైచి గురువుగారునన్ను పూజామందిరమునుండి గెంటేశారు. బైటనేయుండి పూజ చూస్తుంటినని జరిగినదంతయుచెప్పి ఏడ్చాడు.

'పోనీ, విఘ్నేశ్వరుని విగ్రహము చేశాను. దా, యిద్దరము కలసి పూజ చేసుకొందాం'

'వద్దమ్మా, పూజ చేయలేను. మంచమువేయి పండుకోవలెనని ఉంది.

మంచమువాల్చింది. అంత చొక్కావిప్ప సరికి భారతి కండ్లు టపటపమని నీరుకార్చినాయి. వీపు మీద దెబ్బలనుజూచి భరించలేకపోయింది. తన జీవనాధారమగు యేకైక పుత్రుని వీపుపైని యింతటి కఠోరమగుదెబ్బలా! పిల్ల వాడు నల్లగామాడి పోయినాడు. దుఃఖితురాలు, నిస్సహాయురాలగు భారతి యేమిచేయగలదు? సాయంత్ర మగుసరికి అనంతంకు తీవ్రమయిన జ్వరముతగిలింది. నీలి మేఘములు తండోప తండములుగా వచ్చి నభమును గ్రమ్మి వేసినాయి. తాండవ నృత్యము ప్రారంభమయింది. ఉరుములు, మెరుపులతో వర్షము కురియసాగాయి. అట్టి సమయమున ఆ దరిద్ర కుటీరమునకు వచ్చెడి వారెవరు? సొమ్ముయెక్కడనుండి వచ్చును? రాత్రి యంధ కార బంధురంబయి యుండింది. అనంతం ఒకటే పలువరింపు 'కొట్టకండీ గురువుగారు, మా అమ్మను డబ్బు అడిగి తెస్తాను. రమేశాన్ని నే నేమి చేయలేదండి. మా యిద్దరి బుర్రలు గుద్దుకొన్నాయి కాని'

పలవరింపులు లావయిపోయింది. పాపం భారతి దేముళ్లకు మ్రొక్కుతుంది. అనేక విధాలుగా వేడుకుంది. కుమారుని కొరకు ప్రాణములను సైతము ధారపోయుటకు సంసిద్ధురాలు అయింది. కాని యామె యరణ్య రోదనం ఆలకించు వారెవరు? మూడుదినములు గడచింది. అనంతం కొన యూపిరినికూడ విడచిపెట్టాడు. భారతి కండ్లనుండి యిప్పుడొక నీటి బొట్టుకూడ పడుటలేదు. వెర్రిదానివలె చూస్తూ కూర్చుంది. సెలవు పుచ్చుకొని కాలేజీనుండి తొందరగా వచ్చుచున్న ప్రమదంచూచి యామె నోదార్చి దహన సంస్కారమున కాయత్తు జేశాడు. భారతి కూర్చున్న చోటు కదలలేదు. నోటంట మాటలేదు.

శవమును శ్మశాన వాటికకు తీసుకొనిపోయి రెండుగంటలయింది. ఇంతలో తపాలా బంట్రోతు వచ్చి "అనంతంబాబూ, అనంతంబాబూ" యని కేక వేశాడు.

ప్రమదం బయిటకు వచ్చి చూచెను. అనంతంకు నాలుగువందలు రూపాయిల మనియార్డరువచ్చింది. భారతి వద్దకువెళ్లి 'పిన్నీ, నీ వేలుముద్ర కావాలి' అన్నాడు.

భారతి జీర్ణహృదయములో నాలోచించుట కేమియు శక్తిలేదు. ప్రమదం చెప్పిన ప్రకారము వేలుముద్ర వేసింది. టంగు టంగుమని నాలుగువందల రూపాయలను వాయించి లెఖ్ఖబెడుతూ యున్నప్పుడు ప్రమదం మనస్సు డోలాయమానమయింది.

'ఎవరికీ నాయనా రూపాయలు?' అడిగింది భారతి.

'నీకేను, పిన్నీ! రంగంనుండి వచ్చినవి'

'ఇన్ని రూపాయిలు నాకు పంపించే దాత యెవరు?'

'గోపాలం రంగంలో నొక మహారాజువద్ద యుద్యోగం చేసినాడట. ఆయన పంపించినాడు.'

అనునయ వాక్యములచే నోదార్చి ప్రమదం యింటికి వెళ్లిపోయాడు. భారతి రూపాయిలను కొంగున మూటగట్టుకొని శ్మశానవాటికకు పరుగెత్తింది. చితి పూర్తిగా కాలిపోయింది. వేడిబూడిద మాత్ర ముంది. ఆ వెచ్చని బూడిదపై భారతి రూపాయిలను బోసి 'ఒరే నాయనా, అనంతం, నీవు నాలు గణాలకొరకు ప్రాథేయ పడనక్కరలేదు. నాలుగువందల రూపాయిలు మీ నాన్నగారు పంపించినారు. లే, నాయనా, ఇవిగో రూపాయి'లంటూ యెలుగెత్తి యేడువసాగింది.

ఎవరువస్తారు? ఎవరువింటారు?— ఆమె ఘోష...... (హిందీనుండి)

## గొంతెమకోరికలు

పద్మరాగాలతో జిగిలు బోలుపారు;
తళతళలతో కనుల మిఱుమిట్లుగొలుపు;
పట్టుకన్నను మేలు పుట్టంబుగట్టు;
ఆరుద్రపురువల్లె నేనుండరాదే!

కనురెప్పపాటులో కడలెల్లగడిచి;
కనులకందనిచోట్ల గన్గొనివచ్చి;
సృష్టికతీతమౌ సృష్టిరచించు;
కవిమనోవేగంబు నాకబ్బదేలో!

సరసరాగాలతో, కులుకుచును నడుచు;
గాంధర్వగానాల, లోకాలదనుపు;
మఱచిపోయినకలల, మనసులో నిలుపు;
మలయమారుతమల్లె, నే మెలగలేనే!
కోయిలకుగానంబు, గఱపగాలేనే!!

—ధరణికోట శ్రీరాం.

# ప్రవచనములు   

"చిల్లర విషయాల్లో శ్రద్ధగా కనుక్కోవాలి. అవసరమైనప్పుడల్లా నక్కవినయాల నభినయించడం ముఖ్యం. వాదించి వంకలెంచకు. ఆమె వింటోండగా పరస్త్రీని యెప్పుడూ పొగడకు సుమా!"—ఈ వుపాయాలు అవలంబిస్తే, తమ అనురాగం అడుగంటి పోయినాకూడా, భార్యలతో కాలక్షేపం చేసెయ్యొచ్చు భర్తలు—అంటాడో రచయిత. ఈ సలహా భార్యయెడల విముఖుడైన యే భర్తా వినరాదని నా హెచ్చరిక. ఏమంటారా—

అసలు ప్రేమకి టక్కులవసరం లేదు. చల్లగా వుంటూనే, సర్వంలోగొంటుంది. సిసలైన ప్రేమ సివమెత్తి తిరగదు. గాఢప్రేమికులు మంతనాలాడినా, మన్నించుకున్నా హృదయాలతోటే.

ప్రేమలేని పరిస్థితిలో ప్రేమనటన చెయ్యడం దుస్సాధ్యంకాదు కొందరికి. కాని అది వట్టి నిరుపయోగమైన ప్రయత్నం. అంతేకాదు హేయాతి హేయం. దీనివల్ల వున్నలోటుకి, మోసం తోడవుతుంది. ఈ కపటనటన దాంపత్య జీవితాన్ని విషతుల్యంగా మారుస్తుంది. ఇట్టిక్లిష్టసమస్య నెదుర్కొన్న పురుషుడు ఒకస్పష్టమైన ధర్మాన్ని మటుకు మరచిపోకూడదు. అదేకరుణ. ప్రేమించి ధన్యంచేసుకోలేకపోయాడు ఆతని జీవితాన్ని. కరుణ ప్రసాదించి ఆమె దుఃఖాన్ని వుపశమింపజెయ్యడం అతనివిధి. ఇది పెనిమిటియొక్క కనీసపు కర్తవ్యం.

భార్యపై నిర్వ్యాజమైన ప్రేమ చూపలేక పోవడం మహాదురదృష్టం. ఈ దుర్భోగం జీవితాంతంవరకూ అనుభవించి తీరవలసిందే. పూర్వజన్మపాపం అని సమర్ధించుకుని సంతుష్టిపడాలి—అంతే. ప్రేమలేనిచోట కారుణ్యం కావలిసినంత సర్ది వెయ్యగలదు. అది ప్రేమలేని లోటు తీర్చలేదుగాని మగనికి కొంతమటుకు తృప్తీ, ఆలుకి తనదుఃఖాన్ని మరచిపోటానికి శక్తీ యిస్తుంది.

హితవుగాకపోయినసందర్భాలు కిమ్మనకుండా శిరసావహిస్తూ, పరస్పరం సానుభూతితో ప్రవర్తించడమే నిజధర్మం నెరవేర్చడం. ఆ ప్రకారంగా కాలక్షేపం చేసుకోడానికి అవకాశం లేకపోలేదు. కాని ఇటు ప్రేమా లేక, అటుధర్మదృష్టీ లేకపోతే మాత్రం, ఆ దంపతులు వేరైపోడం తెలివైనపని. కలిసివుండడానికి యింకేం ప్రయత్నించినా గోలకీ, కలహానికీ—కారణమవుతుంది.

[ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌లోని 'సాకా' వారి సైడ్‌లైట్స్‌నుండి]

"తెలుగుదేశపు తెలుగు పిల్లలు
తెలుగు వెలుగు లండీ!"





—నూతన వత్సరాగమనమున
చెన్నపురి ఆంధ్రమహాసభ -
స్త్రీలశాఖ పిల్లలువారి నేస్తాల
కచ్చిన ఆతిథ్య దృశ్యాలు.

"తెలుగుబాలురు తెలుగు బాలికలు
తెలుగు సొమ్ములండీ!"



"గరమ్ చా, గరమ్ చా!"



—ఆంధ్రమహాసభ – స్త్రీలశాఖ
బాలబాలికల ఆతిథ్య దృశ్యాలు

"మైసూర్ పాక్, మైసూర్ పాక్!"

# దాంపత్య దృశ్యాలు



ప్రేమతో, స్నేహంతో, సానుభూతితో స్త్రీ పురుషులు సంచరిస్తే, — సంసారం సాగరం కాదు!— పన్నీటికాల్వ అవుతుంది. సంఘం సౌందర్య సౌరభ్యాల్లో వెలుగుతుంది. ఒకరు దక్షిణ ధృవంలోనూ, ఇంకోరు ఉత్తర ధృవంలోనూ వుంటే— ఆ యిల్లు చీకట్లో, చినుకులో, కుళ్లులో కుమిలిపోవలసిందే!

—అరుంధతి—



"నావ నడచిపోయె నట్టేటి జాలులో,—
కలిమియు చెలిమియు తొలగిపోయెను కలసి,—
వలపు నన్నేటికో వదలదు, వదలదు!—"

— మున్నీరు —

సముద్రుని గంభీరస్వరాల్ని శృతిగా చేసుకుని, నిండుగుండెతో పండువెన్నెల్లో పాడిపాడి, పడుక్కున్నాడాయాసంతో. ముఖంమీద కన్నీళ్లు నక్షత్రాల్లాగ మెరుస్తున్నాయి వెన్నెల వెలుగుకి.

అతను సౌందర్యపిపాసి. ఏ ప్రేమమూర్తుల నారాధించాడో గాని, లలితకళలన్నీ అతనిలోనే మూర్తీభవించాయి.

నావల్లో, వెన్నెల్లో, సౌందర్యవతులతో సంచరిస్తూ,—కంఠం మెలికల్తో మాధుర్యాల్ని ఒలికిస్తూ,—నిండు ప్రాణాలతో సుందర శిలా విగ్రహంలాగ వెలిగేవాడతను.

ప్రకృతిమయి రమణీయశోభల్ని, నగ్నసౌందర్యాల్ని, రంగుల్లో చిత్రించి,—వాటిలో యవ్వనాన్ని పొదిపిపెట్టినాడతను.



ఆ సుందర స్వప్నంలో విషాదచ్ఛాయలు గోచరించాయి!

ఆ ప్రణయసౌందర్యరసపూర్ణస్వర్ణపాత్ర విషసముద్రంలో విసరివేయబడింది! హా విధీ! కఠిన విధీ!

చాల చిన్నవయస్సులోనే అతనికి పెళ్లయింది. అతనికి జ్ఞాపకంకూడ లేదేమొ! ఆమె—అతని భార్య—సౌందర్యవతీ కాదు! సంస్కారంగలదీ కాదు! అయినా ఆమె తన సహధర్మచారిణి గనుక, ఆమెను సంతోషపెట్టడం తన విధ్యుక్తధర్మమని తలచాడు. తనామెను నిరాకరిస్తే ఆమెకు వేరే గతిలేదని గుర్తించాడు. ఆమెకు ఉత్సాహాన్ని కలుగచెయ్యాలని అతనెంత ప్రయత్నంచేసినా లాభంలేకపోయింది. నవ్వులు ఆమె పెదవులమీద ఎన్నడూ నాట్యం చెయ్యలేదు! సంగీత సాహిత్యసభలకు పోయి ఏ రాత్రికో ఇంటికి వచ్చేవాడతను. పస్తుతో ఏడుస్తూ పడుక్కునేది ఆ 'పతివ్రత'!

అతను సభలకు స్వస్తిచెప్పి ఇంట్లోనే పాడుకుంటూండేవాడు. అతను రచించిన నగ్నచిత్రాల్ని, ప్రేమగీతాల్ని అసహ్యించుకునేది, ఆమె!

కొన్నాళ్లకు వాళ్లింట్లో బాలచంద్రుడుదయించాడు.

ఆ నూతనోత్సాహంలో అతనెన్నో మధురగీతాలను రచించాడు; సుందరదృశ్యాల్ని చిత్రించాడు!

ఒకనాడతని సహాధ్యాయి అనూరాధ వాళ్ళింటికి వచ్చింది. ఆమె సౌందర్యవతి—కవయిత్రికూడ.

అతనింటలేడు ఆ సమయాన. అతనిభార్య ఆ నూతన స్త్రీతో పలకరించకుండ, పెరట్లోకి పారిపోయింది ధుమధుమలాడుతూ!

'శశి' వచ్చి అనూరాధని మేడమీదికి తీసుకుపోయాడు. వాళ్లిద్దరూ ఆ నగ్నసౌందర్యాల్ని ఆఘ్రాణిస్తూ, ఆనందిస్తూంటే, ఆయన వచ్చాడు.

'ఎప్పుడొచ్చావు అనూ! ఈయన మా శశి' అంటూంటే ఆమె శశి ముఖంమీద నవ్వుల పువ్వుల్ని వర్షించింది.

'శశీ! అమ్మను పిల్చుకొని రా' అన్నాడతను.

పరుగు పరుగున పోయి వచ్చి 'అమ్మెప్పుడూ ఏడుస్తోంది! తలనొప్పట!' అన్నాడు.

పాపం! తల కొట్టినట్టయిందతనికి. 'అనూ' వచ్చిందన్న ఉత్సాహంలో తన నూతన రచనలను ఆమెకు వినిపించాడు.

'శశి' 'అనూ' ఒళ్లో నిద్రపొయ్యాడు. సన్నని వెన్నెలలు ఆ చిన్ని పెదవులమీద నాట్యాలు చేశాయి.

♦ ♦ ♦ ♦

అతను 'అనూ'తో కలిసి నటించిన చిత్రం ఆ మర్నాడు విడుదలయ్యింది ఆ ఊళ్లో!

భార్యను రమ్మన్నాడు సినీమాకి అతను. 'ఆమె వుందిగా, నేనెందుకు? శశీ నేనూ వుంటాం. మీరిద్దరూ వెళ్లిరండి' అంది.

సున్నితమైన అతని హృదయం కోపంతో కంపించింది.

పట్టుపట్టి కార్లో కూర్చోపెట్టి ఆమెను చిత్రానికి తీసుకుపొయ్యాడతను, శశి అనూరాధలతో.

అతను అనూతో కలిసి నాట్యంచేసిన దృశ్యాన్నిచూసి మూర్ఛపోయింది కుర్చీలో! అందరూ లేచారు. దీపాలు వెలిగాయి. కంగారుతో కృంగిపోయిందతని కవిహృదయం.

'ఛీ! నా సుందర సంగీతంలో అపస్వర తంత్రుల్ని మీటేందుకే జన్మించావ్!' అని నిస్పృహతో ఇంటికి చేరుకున్నాడు.

ప్రణయగీతాల్ని పాడే అతని నేత్రాలు నిరాశారోదనలు చేస్తున్నాయి యిప్పుడు!

రాత్రుళ్లు సముద్రంఒడ్డున ఏకాంతంగా పాడుతూంటాడు,

"వలపు నన్నేటికో.........!"అని...

## కన్నీరు

ఆమె ఉన్నతవిద్యల్నభ్యసించింది. 'సంస్కారం' లేనివాడు ఆమెను పరిణయమాడాడు.

సాయంత్రాలు స్నానంచేసి పువ్వుల్ని పెట్టుకున్నా, పాటలుపాడుకున్నా మండిపోతూంటాడతను.

పువ్వుల్నీ నవ్వుల్నీ ప్రేమించిన ఆమె జీవితం 'ఎడారి'లా అయిపోయింది. తాను ప్రేమతో పేసుకున్న తోటలోని పువ్వుల్ని మ్మెసి కూరలు కొనేవాడు ఆ తిండిపోతు! పత్రికల్నేవీ చదవనిచ్చేవాడు కాదు—స్త్రీలకి స్వేచ్ఛకావాలని వాదిస్తాయట!

తెల్లనిచీర ధరించి, తల్లో మల్లెపూలను పెట్టుకుని, చకోరాన్ని చూస్తూ, వెన్నెల్లో ఆమె

"వలపు వెఱ్ఱిదేమొ పండువెన్నెల గోరు!"

అని పాడుకుంటూంటే రుసరుసలాడుతూ ఆయన వచ్చాడు.

'వలపు! వలపు!' వలపేమిటే? ఇల్లాలివై అలాంటిపాటలు పాడ్తావుటే!...అన్ని మల్లెపువ్వు లెందుకు పెట్టుకున్నావు తల్లో? దూబరా! అని అరచాడు.

ఆ రాత్రంతా ఆమె కన్నీరుకారుస్తూ పడుక్కుంది. తల్లో పువ్వులన్నీ తడిసిపోయాయి.

ప్రణయగీతాల్ని పాడే ఆమె నేత్రాలిప్పుడు నిరాశారోదనలు చేస్తున్నాయి!

## పన్నీరు

ప్రభాతగానం చేస్తున్న పక్షుల్నీ, అరుణ కిరణకాంతుల్నీ చూసేందుకై అతను స్నానంచేసి బయల్దేరేవాడు.

పాటలను పాడుకుంటూ, పువ్వుల్ని కోసుకుంటూ కిందికి వస్తూండేది ఆమె. వారిద్దరూ ఒకే కాలేజీలో విద్య నభ్యసించేవారు. వివాహమయింది వారిద్దరికీ. ఆ స్నేహం యీ స్నేహం కలిసిప్రణయంగా పరిణమించింది.

అతనుహైస్కూల్లో ప్రధానోపాధ్యాయుడుగా నియమింపబడ్డాడు. ఆమె స్వయంగా మాసపత్రికను నడుపుతూవుంది.

దినానికి కొన్నిగంటలసేపు వారు సాహిత్యచర్చల్లో పాల్గొంటూ వుంటారు.

అతని పద్యాల్ని పాడుతూ, రూపికల్ని చిత్రిస్తూంటుంది ఆమె.

వారు పూల నావలో పాడుకుంటూ—సాహిత్యసముద్రంలో ప్రయాణంచేస్తున్నారు.

ప్రేమతో, స్నేహంతో, సానుభూతితో స్త్రీ పురుషులు సంచరిస్తే,—సంసారం సాగరంకాదు!—పన్నీటికాల్వ అవుతుంది. సంఘం సౌందర్య సౌరభ్యాల్తో వెలుగుతుంది.

# విజ్ఞానం



## గ్రహోద్భవం

—వసంత—

'సిద్ధాంతిగారూ! మా అమ్మాయికి వివాహం నిశ్చయించేం; మీరు సుముహూర్తం ఏర్పాటు చెయ్యాలి' అంటే 'చిత్తం బాబూ! వధూవరుల జాతకాలు పంపించండి. శుభప్రదమైన ముహూర్తం నిశ్చయిస్తాను' అంటారు సిద్ధాంతిగారు. ఆపత్కాలంలో, అనారోగ్య సమయంలో గ్రహపూజ చేయమనీ దుష్టగ్రహశాంతికి అనువైన పదార్థం పెసలో, మినుములో, కందులో, బొబ్బర్లో దానం ఇయ్యమని కూడా మన సిద్ధాంతులు చెప్తారు. దైవంపై వైరం, గ్రహాలపై ఆగ్రహం వహించిన ఎంత మొండి ఘటాలైనా 'తమదాకావస్తే తగవులే' దని ఆప్రకారం చేయడం మనకు తెలిసిన విషయమే! మానవ జీవితంలో ఇంత సన్నిహిత సంబంధం ఏర్పరుచుకొన్న 'ఈ గ్రహాలేమిటి?' అను విషయం ఎంతో హృదయంగమంగా ఉంటుంది

ఏ జాతక చక్రం చూచినా అందులో 9 గ్రహాలు కనిపిస్తాయి. అవి బుధుడు, శుక్రుడు, కుజుడు, గురుడు, శని, సూర్యుడు, చంద్రుడు, రాహువు, కేతువు. కాని 'గ్రహం' అంటే ఒక నక్షత్రాన్ని ఆశ్రయించుకొని దానికి నిత్య ప్రదక్షిణాలు చేస్తూఉండేది' అని భౌతిక విజ్ఞానులు (Scientists) 'గ్రహ' పదాన్ని నిర్వచించేరు. మన సూర్యుడొక నక్షత్రం. సూర్యునిచుట్టు కొన్ని మూర్తులు తిరుగుతున్నాయి. వాటికే గ్రహనామం చెందుతుంది. అవీ తొమ్మిదే ఉన్నాయి. బుధుడు, శుక్రుడు, భూమి, కుజుడు, గురుడు, శని, యురేనస్, నెప్ట్యూన్, ప్లూటో. న్యాయానికి, నిజానికి ఆ తొమ్మిదే నవగ్రహాలు. కాని, జ్యోతిష నవగ్రహాలలో 5 నిజమైన గ్రహాలు ఉన్నాయి. అవి బుధుడు, శుక్రుడు, కుజుడు, గురుడు, శని. అయితే భౌతిక విజ్ఞానుల నిర్వచనానికి సరిపడే నవగ్రహాల గురించి ముచ్చటిద్దాం.

మనవలెనే ఈ గ్రహాలుకూడా ఒకప్పుడు జన్మించేయి. రమారమి 200 కోట్ల సంవత్సరాల పూర్వం పుట్టేయని భౌతిక విజ్ఞానులు నిర్ణయింపగలిగేరు. అంతేకాక అనుదిన పూజావిధానంలో ప్రారంభాన్ని మనం చెప్పుకొనే సంకల్పంలో 'వైవస్వతమన్వంతరే, కలియుగే, ప్రధమపాదే' అను కాలపట్టినిబట్టి భూమియొక్క ప్రాయం లెక్కకట్టినా 196 కోట్ల సంవత్సరాలని నిశ్చయమౌతుంది. కృతయుగం, త్రేతాయుగం, ద్వాపరయుగం, కలియుగం కలిసి ఒక మహాయుగం. మహాయుగాలు 71 చేరి ఒక మన్వంతరం అవుతుంది. అట్టి మన్వంతరాలు 6 గడచిపోయినాయి. ఏడవ మన్వంతరంలో 27 మహాయుగాలు గతించేయి. 28-వ మహాయుగంలో కృత, త్రేత, ద్వాపరయుగాలు వెళ్లిపోగా కలియుగం నడుస్తూంది. కలియుగంలో 5040 సంవత్సరాలు అయిపోయినాయి. భూమి పుట్టినదిలగాయతు ఈ ప్రకారం గతించిన 6 మన్వంతరాలు, 27 మహాయుగాలు, 3 యుగాలు, నాల్గవయుగంలో 5040 ఏండ్లు లెక్కవేసి కూడితే 196 కోట్ల ఏండ్లు అయినట్లు తెలుస్తుంది. భూమితోపాటే ఇతర గ్రహాలన్నీ పుట్టేయి.

ఈ గ్రహాల జన్మచరిత్రం అత్యద్భుతమైంది. నవగ్రహాలు, వాటివాటి ఉపగ్రహాలతో సహా సూర్యునిలోనుండి పుట్టేయని విజ్ఞుల సిద్ధాంతం. సూర్యబింబంగా మనకు కనిపించేది ఒకపెద్ద వాయుగోళం. ఆగోళంలోని వాయువులు మండుతున్నాయి. ఎప్పుడూ మండుతూనేఉన్నాయి. నిత్యమూ అగ్నిజ్వాలలు గ్రక్కుతున్నాయి. సంపూర్ణ సూర్యగ్రహణ సమయంలో తీసిన సూర్యుని ఛాయాచిత్రం చూస్తే సూర్య బింబంచుట్టు మహోగ్రమైన జ్వాలలు కనిపిస్తాయి. ఆ జ్వాలలు లక్షలకొలదిమైళ్లు మీదికి దూసికొని పోతూన్నట్లు తెలుస్తుంది. మంటలు మీదిమీదికి ఎగయడం స్పష్టంగా కనిపిస్తుంది. ఆమంటలతో అపరిమితంగా వేడి, వెలుతురు అన్నివైపులా వ్యాపిస్తున్నాయి.

అట్టి సూర్యగోళం ఒక నక్షత్రమని యిదివరకే మనవిచేసేం. మిన్కుమిన్కుని చీకట్లో ఆకాశమందు కనుపించు నక్షత్రాలన్నీ మండుచున్న గోళాలే! ఈ నక్షత్రగోళాలన్నీ ఆకాశంలో సంచారం చేస్తున్నాయి. అతి దగ్గరగానున్న నక్షత్రాల ఎడం 25 లక్షలకోట్లమైళ్లు. అంటే ఊహకందిందా? సెకెనికి 1,86,000 మైళ్ల వేగంతో పరుగెత్తు వెలుతురు—ఎంతవేగమంటే, 25,000 మైళ్లు చుట్టు కొలతగల భూమిని 7 మార్లకుపైగా ఒక్క సెకెనులో చుట్టిపెట్టి రాగల విపరీతవేగంతో అహర్నిశలు నెమర్లు గ్రక్కుతూ పరుగెత్తుతూన్న వెలుతురు ఒక నక్షత్రంనుండి దానికి ప్రక్కనున్న నక్షత్రాన్ని చేరుకోడానికి $4\frac{1}{4}$ సంవత్సరాలు ప్రయాణంచెయ్యాలి. అంతంత ఎడంగా ఉంటాయి కాబట్టే సామాన్యంగా నక్షత్రాల నిత్య సంచారం ప్రమాదంలేకుండా క్షేమంగా సాగిపోతూంది.

అయితే బయట ప్రదేశంలో విచ్చలవిడిగా తిరుగాడు కుర్రల్లాగ నక్షత్రాలు అనంతాకాశంలో పరుగులెత్తడానికి మాత్రం వీలులేదు. సగటున సామాన్యనక్షత్రం 20 లక్షల కోట్ల కోట్ల కోట్ల టన్నులు బరువుందని విజ్ఞానులు చెప్తారు. అంత బరువుండి ఒక్క ప్రోగుగానున్న ద్రవ్యానికి అత్యధికమైన గురుత్వాకర్షణ బలంసిద్ధమయ్యే ఉంటుంది. అది ద్రవ్యంయొక్క సహజలక్షణం. ఆబలం మూలంగా పరస్పరాకర్షణం కలిగి నక్షత్రాలు వాటి నిర్ణీతమార్గాలలోనే చరిస్తూ ఉంటాయి.

కాని నియమాల నుల్లంఘించేవారు, ఇష్టానుసారం చరించేవారు ఉండనే ఉంటారు. అది నక్షత్రలోకానికి కూడా వర్తిస్తుంది. ఏమంటే ఎంతోకాలంక్రితం ఒకపెద్ద నక్షత్రం, సూర్యుని కెన్నోరెట్లు పెద్దది, స్వేచ్ఛావిహారం చేయ మొదలిడిందని విజ్ఞానులలో కొందరి అభిప్రాయం. సూటీసాటీ లేకుండా స్వేచ్ఛగా తిరుగజొచ్చిన ఆ నక్షత్రం సూర్యుని సమీపింప మొదలుపెట్టింది. సూర్యుడూ నక్షత్రమేకదూ! అందుచేత సూర్యుని దగ్గరకి ఆ నక్షత్రం వస్తూండేసరికి గురుత్వాకర్షణబలం హెచ్చుకా జొచ్చింది. గురుత్వాకర్షణ బలానికున్న విశేషమేమంటే దూరం తగ్గుతూంటే బలం అధికమౌతుంది. నక్షత్రం సూర్యుని సమీపిస్తూన్న కొద్దీ దూరం తగ్గుతూంది; గురుత్వాకర్షణ బలం హెచ్చుతూంది. బలం హెచ్చుకాగానే సూర్యునిలో వాయుతరంగాలు ఉత్పన్నమయేయి మన సముద్రపు కెరటాలవలె. సూర్యునిలో పుట్టిన ద్రవ్యతరంగాలు 'ఇంతింతై, అలలింతయై, మరియు దామింతై, నభోవీధిపైనింతై' అన్నట్లు వడివడిగా పెద్దవికాజొచ్చేయి, ఆకొంటె నక్షత్రం సూర్యుని ఇంకా సమీపిస్తూనేఉంది. సూర్యునిలో తరంగాలు మహాద్భుతంగా ప్రళయోద్రేకంగా విజృంభిస్తూనే ఉన్నాయి. అట్టి సందర్భంలో నక్షత్రం వెనుకకు మరలింది. అప్పటికే వాయు

తరంగాలు మహాప్రమాదకరంగా ఊర్ధ్వదృష్టితో ఉన్నాయి. అట్టి తరంగాలను ఆపెంకె నక్షత్రం వెనుకకు పోతూపోతూ వికటాట్టహాసంతో పైకూడ పెకికింది. 'పెటుగుట విఱుగుటకొఱకే' అయింది. ఆ కెరటాలు విఱిగి ఆకాశంలో పడ్డాయి. వాటి నక్కడే విడిచిపెట్టి తన ప్రతాపాని కుప్పొంగుతూ నక్షత్రం తనదారిని గనుపోయింది. ఆ నక్షత్రబలంచే పైకూడిపడ్డ వాయుఖండం మాత్రం నక్షత్రంతోనా పోలేకపోయింది; సూర్య గర్భంలోనికి మరలలేక పోయింది; ఆకాశంలో నిలిచిపోయింది. కాని, తన గర్భంనుండి వెలువడ్డ ద్రవ్యఖండాన్ని గురుత్వాకర్షణ శక్తితోపట్టి పారిపోకుండా తన చెంతనుంచుకొన్నాడు సూర్యుడు. పాపం ఎంతైనా గర్భవాసం కదూ!

ఇట్లు విడువడ్డ వాయుఖండం ఎట్టి ఆకారంగలదో గమనించాలి. తరంగాలుగా వాయువుపై కుబుకుతున్నంతకాలం దానిని సూర్యుడొకవైపు, నక్షత్రం ఒకవైపు లాగుతూండిన కారణంచేత అది పొగచుట్ట ఆకారంగాసాగి, తెగి, ఆకాశంలోపడింది. లావుగా, పొడవుగానున్న ఆ ఖండంయొక్క మధ్యభాగం దళసరిగానుంది, కొనలు సన్నగిల్లేయి. ఆ రూపంలోనున్న పరితప్తవాయుఖండం క్రమేణ చల్లారింది. చల్లారుతూ ముక్కలుముక్కలుగా తెగింది. ఆ ముక్కలు గోళాకారంవహించేయి, ద్రవించేయి. మరికొంత కాలానికి గోళాలుగా ఘనీభవించేయి. ఆ గోళాలే గ్రహాలు. గ్రహాలన్నీ సూర్యునిచుట్టు పరిభ్రమిస్తున్నాయి.

ఒకే వాయుఖండంనుండి ముక్కలైనవికాబట్టి గ్రహాలు సూర్యునినుండి వేరువేరుదూరాలలో నున్నాయి. సూర్యుని కతి దగ్గరగానున్న బుధునిదూరం మూడుకోట్ల అరవైలక్షలమైళ్లు; అతి దూరంగా నున్న ప్లూటోదూరం ముప్పైయారుకోట్ల ఎనభైలక్షలమైళ్లు. మనభూమి సూర్యునికి 9 కోట్ల ముప్పైలక్షల మైళ్లు ఎడంగా ఉంది.

మధ్యస్థంగానున్నగ్రహాలు పరిమాణంలో పెద్దవి; కొనలనున్నవి చిన్నవి. అన్నిటిలో పెద్దదయిన గురునియొక్కనిడివి 86,000 మైళ్లు. చిన్నదైన ప్లూటోనిడివి 2,000 మైళ్లు మనభూమినిడివి సుమారు 7,920 మైళ్లు.

గ్రహాలన్నీ సూర్యునిచుట్టు తిరిగుతున్నాయి కదా! అయితే, ఒక్కొక్క గ్రహం ఒక్కొక్క కాలంలో ఒక ప్రదక్షిణం చేస్తుంది. మనభూమి ఒక ప్రదక్షిణంచేసేకాలాన్ని 'సంవత్సరం' అని నామకరణం చేసేం. మన సంవత్సరంలో 365 రోజులున్నాయి. అట్టి 88 రోజులలో బుధగ్రహం ఒక ప్రదక్షిణంచేస్తుంది. శని 30 ఏండ్లలో ఒక ప్రదక్షిణంచేస్తుంది. ప్లూటో 250 ఏండ్లకుగాని సూర్యునిచుట్టు ఒకసారి తిరగలేదు. ప్లూటోలో జీవులుంటే వారి 'సంవత్సరం' మన 250 సంవత్సరాలకు సమానం!

సూర్యునిచుట్టు తిరగడమేకాకుండా గ్రహాలు వాటివాటి అక్షములమీద అంతర్భ్రమణం చేస్తున్నాయి. ప్రతిగ్రహం బొంగరంవలె తనలోతను తిరుగుతూంది. సూర్యోదయంనుండి సూర్యోదయంవరకు గడచుకాలాన్ని 'దినం' అని వ్యవహరిస్తున్నాం. కాబట్టి భూమి ఒక అంతర్భ్రమణంచేయడానికి ఒకదినం పట్టుతుంది. బుధుడు తనలోతను ఒకసారి తిరగడానికి 88 రోజులవుతాయి. గురుడు 10 గంటలలోనే ఒక అంతర్భ్రమణం చేస్తుంది.

కొన్ని గ్రహాలకి ఉపగ్రహాలున్నాయి. గ్రహంలోంచిపుట్టి దానిచుట్టు తిరుగుచుండేది 'ఉపగ్రహం' మనభూమికొక ఉపగ్రహం ఉంది. అది చంద్రుడు. శనికి 9, గురునికి 10, ఉపగ్రహాలున్నాయి.

ఉపగ్రహ సమేతంగా గ్రహాలు పరివేష్టించి ఉండగా తన కుటుంబంతో ఆకాశయానం చేస్తున్నాడు సూర్యుడు. ఈ సౌరకుటుంబం ఎంతవరకు వ్యాపించిందో, పరిమాణంలో, దూరంలో, సూర్యునికి గ్రహాలకి అన్యోన్యంగా ఎట్టి అంతరం ఉందో పూర్తిగా గ్రహించడానికీ, సరియైన ఉద్దేశం ఏర్పరచుకోడానికీ సౌరమండలాన్ని చిన్న పరిమాణంలో నిర్మించుకొందాం. 18 లక్షల చ॥మైళ్లు వైశాల్యంగల మన భారతదేశాన్ని 70 చ॥ అంగుళాల కాగితంపై నిరూపిస్తున్నారు. ఆ పటంచూచి వివిధరాష్ట్రాల వ్యాప్తి గుర్తిస్తున్నాం. మహానదులేవిధంగా ప్రవహిస్తున్నాయో తెలిసికొంటున్నాం. మన భారతదేశమంటే ఈ ప్రకారంగా ఉందికదా అని ఒక చక్కని అభిప్రాయం ఏర్పరుచుకొన్నాం. అట్లే, సౌరమండలంయొక్క ప్రతి మరొకటి నిర్మించుకొందాం.

సుమారు 8½ లక్షలమైళ్లు నిడివిగల సూర్యబింబానికిబదులు ఒక తియ్య గుమ్మడికాయను ఉంచుదాం. అప్పుడు, సూర్యునికి ప్రక్కగానున్నబుధుని ఒక చిన్న ఆవగింజతోనిరూపించి, దాని నా గుమ్మడికాయకు 20 గజాలదూరంలో పెట్టాలి. ఆ పరిమాణంలో గ్రహాలను క్రమంగా నిర్మించడానికి ఆ గుమ్మడికాయకు 37 గజాలు ఎడంగా ఒక కందిగింజ—శుక్రుడు, 52 గజాలు ఎడంగా మరొక కందిగింజ—భూమి, 79 గజాలుదూరంగా ఒక పెద్ద ఆవగింజ—కుజుడు, 270 గజాలు ఎడంగా ఒకపెద్ద నిమ్మపండు—గురుడు, 490 గజాలు దూరంగా మరొకనిమ్మపండు—శని, 990 గజాలు ఎడంగా ఒక రేగుపండు—యురేనస్, 1550 గజాలు ఎడంగా మరొకరేగుపండు—నెప్ట్యూన్, 2040 గజాలుదూరంగా ఒక సన్నావగింజ—ప్లూటో ఉంచాలి. గుమ్మడికాయచుట్టు ఆ కాయలు, పళ్లు, గింజలు సుమారు వలయాకార మార్గాలలో నిత్యం తిరుగుతున్నట్లు ఊహించాలి. సుమారు రెండుంపావు మైళ్లు వ్యాసంగల గోళంలో ఇవన్నీ సంచరిస్తూ ఉంటాయి. ఆ గోళంలో మిగిలిన ప్రదేశమంతా శూన్యంగా భావించుకోవాలి! అంటే, సుమారు 3600 కోట్ల ఘనపు గజాలు పరిమాణంగల శూన్యగోళంలోనున్న ద్రవ్యం ఒక గుమ్మడికాయ, 2 నిమ్మపండ్లు, 2 రేగుపండ్లు, 2 కందిగింజలు, 3 ఆవగింజలు. ఈ పరిమాణంలో సూర్యునికి సమీపంగానున్న నక్షత్రాన్ని 6000 మైళ్లు దూరంగాపెట్టాలి. అంటే, మరొక గుమ్మడికాయను లండన్‌లో నుంచాలన్నమాట! అట్టి సందర్భంలో నక్షత్ర గ్రహసంచారం సుఖంగా కొనసాగడానికి అభ్యంతరమేముంది? ఈ పరిమాణంలో మానవుడు ఎంత ఉండాలి? 7900 మైళ్లు నిడివిగల భూగోళమే కందిగింజ అయితే 6 అడుగులమనిషి ఎంత కావాలి? అగోచరుడు! అయితే, ఇంతగా ఊహించి, గ్రహించి, సిద్ధాంతీకరించినవాని ఆత్మ ఎంత మహత్తరమైందో!!



తస్మిన్నండే స భగవానుషిత్వా పరివత్సరమ్,
స్వయమే వాత్మనోధ్యానా త్త దండమకరోద్ద్విధా.

తాభ్యాం స శకలాభ్యాం చ దివం భూమిం చ నిర్మమే,
మధ్యేవ్యోమ దిశశ్చాష్టావపాం స్థానం చ శాశ్వతమ్.

# కాన్వెంట్ స్కూళ్ల చదువులు

**శ్యామల**

అక్షరాభ్యాసమైననుకాని వయస్సులోనే, మనపిల్లలను, ఆడ మొగవివక్షతలేకుండ, పాశ్చాత్య పద్ధతులలో మిషనరీలచేత నడుపబడుచూ, వారిపిల్లలనిమిత్తమేర్పడిన కాన్వెంట్ స్కూళ్లకు పంపుట నవ నాగరికతకు ముఖ్యచిహ్నముగ నేర్పడినది. కొంచెము ధనికులైనవారు, ఉద్యోగాధిక్యతచేత గొప్పవారమని యెంచుకొనెడివారు, సామాన్యముగ అందరు చదువుకొనెడి బడులలోనికి తమపిల్లలను పంపినచో తమ హోదాలకు భంగమను దురభిమానముతో, దొరలబడులలోనే ప్రవేశపెట్టుచున్నారు. నానాటికి ఈవ్యామోహ మధికమై గృహస్థులనుకూడ ఆవహించుచున్నది. ఆ పద్ధతిచదువు లెంతవరకు ఉపయోగకరములను సంగతి ప్రతి తల్లియు తీవ్రముగ ఆలోచింపవలసియున్నది.

కాన్వెంట్ స్కూళ్లచదువు ప్రారంభించుటతోడనే, మొదటిమార్పు వేషములోగల్గును. దుస్తులమాట యటుండనిచ్చి, బాలికల శిరోజముల నుత్తరించుటయందుగూడ పాశ్చాత్యవిధానమే యవలంబించి, కేవలము 'ఆంగ్లో ఇండియను' కృత్రిమ స్వరూపముల కల్పించుటలవాటైనది.

భాషలోమార్పు తప్పనిసరికదా! బోధన అంతయు ఆంగ్లమందే. నేర్పెడివారు పాశ్చాత్యులే. అవలంబించు విధానము విజాతీయమే. దేశభాషలో అక్షరముల వ్రాయుటైనగాని కూడబలుకుకొని చదువుటైనగాని చేతగాక, మనసులోని భావముల నర్థమగునటుల వారి స్వభాషలో విస్పష్టముగ జెప్పలేని లేతవయస్సునందే ఆంగ్లమునసంభాషణ, ఆంగ్లమునజేయబడుబోధనల నర్థమొనరించుకొనుట ముఖ్యమగుచున్నది. అందువల్ల కల్గు అనర్థము, తల్లిదండ్రులతోను సోదర సోదరీలతోను మాట్లాడుసమయమునగూడ ఆంగ్ల భాషయే సహాయమగుచుండుట, ఒక్కొకసమయ మందింటిలోనివారు మాతృభాషయందు చెప్పుకొనెడిమాటలను సహితము ఆంగ్లమందువివరించి చెప్పినగాని వారికి అర్థముకాని దురవస్థ మనము గమనించుచునేయున్నాము.

ఇక నాబడులలో నలవడు సాంప్రదాయములు, మత, సాంఘికభావములు కేవలమువిజాతీయములని చెప్పనక్కరలేదుగదా! క్రైస్తవమతముదక్క వేరొండెద్దియుజగమునలేదను మతప్రచారకులబోధనలు, ఆ విద్యా విధానమందొక భాగముగ గన్పించుచున్నది. జాతీయతకు, దేశీయభావములకు, స్వసాంప్రదాయములకు, ఆ బడులలో స్థానమేలేదు సరికదా ఆ బడులలోతయారైన పిల్లలకు మాతృభాష, దేశీయాచారములు, జాతీయ సాంప్రదాయములన్న నిరసన, ఏవగింపు, అసహ్యభావము పెంపొందుట గమనించుచున్నాము.

లేతవయసుననే పాదుకొన్న అట్టిభావములు భావిజీవితమందు ఆత్మద్వేషమునకు మూలములగుచున్నవి. అధికులమనిపించుకొనెడి వారవలంబించెడి విధానమే ఆదర్శమని విశ్వసించు గతానుగతికలోకము యీ పాశ్చాత్యసాంప్రదాయములకు పుట్టినిల్లైన "కాన్వెంటు" చదువుల ననుసరించుచో, అత్యల్ప కాలముననే మనజాతి, మనసంస్కృతి, మనవ్యక్తిత్వము అంతటితో అంతరించిపోకతప్పదు. మానసిక బానిసత్వము, భావ దాస్యము, 'మేమెందులకును పనికిరానివార'మను అల్పభావము బాలబాలికహృదయముల బ్రవేసించిననాడు, జాతి వ్యక్తిత్వమంతటితో నాశనమొందును. అంధానుకరణము ఆత్మనాశకారికదా! ఆర్థికముగగూడ

నీ 'కాన్వెంటు' చదువులవలన గల్గు వ్యయమునకు మేరలేదు. ఏవిధముగజూచినను అపకారియే యగు యీ 'కాన్వెంటు' స్కూళ్లకై యెందుల కింతగా భ్రమసెదరు!

తెనుగు తల్లులారా! మనకు మాత్రము జాతి వ్యక్తిత్వము లేదా! సుప్రసిద్ధ సాంప్రదాయములు లేవా! ప్రాచీన సంస్కృతి లేదా! విఖ్యాత వాఙ్మయములేదా! జగద్విఖ్యాతి గన్న అమరావతి, అజంతా శిల్పములు, చిత్రకళలు ఆంధ్రులవి కావా! 'దేశ భాషలందు తెస్స' యన్న ప్రశస్తియే గాక పాశ్చాత్యులచే గూడ 'ఇటాలియన్ ఆఫ్‌ది ఈస్ట్' అని మన్నన పొందినభాష తెలుగు భాష కాదా! పురుషులే కాక స్త్రీలును స్వయముగ రాజ్యముల నేలి తమ చాక చక్యముచే, నెల్లర మెప్పింపగల ధీరులని లోకమునకు స్వీయ జీవిత మూలమున జాటిన రుద్రాంబాది తెలుగు రాణుల సామర్థ్యము పాశ్చాత్య నాగరకత సంపర్కమున కల్గినది కాదుకదా! నన్నయ, తిక్క నాది కవి సామ్రాట్టులతో బాటు వాఙ్మయ రంగమున విస్మరింప నలవి కాని స్థానము నార్జించుకొన్న మొల్ల మున్నగు తెనుగు కవయిత్రుల పాండితికి హూణ సంస్కృతి కారణము కాదుకదా! నిజధర్మమును వీడి, దేశ క్షేమమును విస్మరించి, స్వప్రాణ రక్షణకై రణరంగమునుండి పారి వచ్చిన ఖడ్గతిక్కనాదులకు హితవు గరపి పురుషులకు సహితము మార్గదర్శకులైన తెలుగు వీరమాతలకెట్టి విజాతీయ విద్యయు లేదుకదా! అతిధి అభ్యాగతుల నాదరించుటయందు సరిసాటిలేని జాతి ఆంధ్రజాతియను ఖ్యాతిగడించినది ఆంగ్లేయ సంప్రదాయముల వాసనరయిన సోకని తెనుగు తల్లులుకారా!

మీజాతికి వ్యక్తిత్వములేదని, మీరుచెప్పుకొనదగు సాంప్రదాయములు లేవని, ఎన్నుకొనదగు భాష మీకులేదని, ప్రపంచ మందొక ఆంగ్లజాతి, ఆంగ్లభాష, ఆంగ్లసాంప్రదాయము దక్క వేరొండెరుంగ దగినది లేదని నేర్పు విద్యయా, మీబాల బాలికలకు మీరు నేర్పింప దగినది? మీసంతతియు, రానున్న తరముల వారును, 'ఆంగ్లో ఇండియను' లుగా మారుటయా మీ ఆశయము?

కాల వశమున, రాజాదరణ లేని కారణమున, ప్రజలు పారతంత్ర్యమున మ్రగ్గు చుండుటచేత, మన జాతీయ సంస్కృతి మోడువారినిర్జీవమై యున్నట్లగుపించుచున్న మాట సత్యమే. కాని మీ అంతరంగముల స్వాభిమానమను జీవమున్న యేనాటికైన మన సంస్కృతి మరల తలయెత్తి శాఖోప శాఖలై, ఫలపుష్ప భరితమై జాతీయతా సౌరభమును నలుగడల వెదజల్లక మానదు.

పాశ్చాత్య పద్ధతులన్నియు నిరర్ధకములని కానీ, వారియొద్దనుండి నేర్వ దగినవి లేవనికాని నే జెప్ప సాహసింపను. అవకాశమున్నవారు, తప్పక ప్రతి వారియొద్ద నుండియు జీవితౌన్నత్యమును పెంపొం దింపగల నూతన విషయముల నేర్వవలసినదే. కాని స్వజాతీయతను, స్వభాషను స్వసంప్రదాయములను నిర్మూల మొనరించు, పాశ్చాత్య విధానమున పిల్లలకు అక్షరాభ్యాస మొనరించి పెంచుట ఆత్మద్రోహమునకు దోహద మొనర్చుటయేకదా!

బిడ్డలకు ప్రథమ గురువులు తల్లులే కదా! గృహయాజమాన్యము వహించి, కుటుంబ వ్యవహారముల నెల్ల చక్కబెట్టుకొని పురుషుల క్రమమార్గముల నడిపించునది స్త్రీలుకారా! పురుషులు పూర్వాపరాలోచన లేక కేవల పాశ్చాత్య వ్యామోహమునబడి జాతీయతను గోల్పోవుచుండ, మీరైనను వారిని వారించి జాతీయత నశింపకుండా కాపాడరా!

# నాగరక నాయిక

శ్రీమతి బి. కనకదుర్గాదేవి

## (౧) వాసకసజ్జిక

తొలుసంజ సీరెండ చలువసోనలలోన
చెమ్మగిల్లిన పూలకమ్మదనము,
జిలుగు వంపులయింపు మెలికలౌనును సొంపు
లనుజిల్కు కురుల 'రిబ్బను'ల నీటు,
తరులతా విహగచిత్రణ శోభితమ్మగు
వలువచే వెలయు 'టేబిలు' పసందు,
నిడుద యూర్పులవోలెఁ బొడము సూక్ష్మలధూమ
చక్రమ్ములను జిమ్ము 'చా' హుషారు,
పట్టు దిండులతోటి సోఫాల యూపు,
శీతపవనంపుఁదాకు, 'జార్జెట్టు' షోకు,
'లిప్‌స్టిక్కు' మాధుర్యమ్ము, 'లెదరు' సంచి
వేడుకయు మదనతాపమ్ము వృద్ధిసేయ,
నిప్పుడో యింకొక క్షణమ్మొ యేఁగుదెంచుఁ
దనదు ప్రియుఁడంచు వేచెడిఁ దరళనయన!

## (౨) విప్రలబ్ధ

ప్రాంగణమ్మునఁ గొంటె పవనుండు సడిచేయ,
'హల్లో' యనుచుఁ జూచి, తల్లడిల్లు;
అంతరంగమునందున తనుతాపము హెచ్చ
నుద్విగ్నయై 'పియానో'ను నొక్కు;
ఖంగు ఖంగని 'లిల్లి' కంఠానఁ గల మువ్వ
మ్రోగుచో టెలిఫోను మ్రోలకేఁగు;
గ్రీష్మవర్షముఁ బోలు నూష్మాశ్రువులలోనఁ
గనుతీరుఁ బెదవిసౌరును గరంగ,
వాడు మొగముతోడఁ బాడును గొంతెత్తి,
యక్కుఁ జేర్చు 'లిల్లి' నార్తితోడఁ;
బ్రణయుఁ దోడితేర, బ్రార్థించుదానిని
విప్రలబ్ధయౌచు వెత్తిపడఁతి.

## (౩) అభిసారిక

ప్రాచీనకావ్యప్రబంధమ్ములందలి
యంచయానను పేర నాదరంబొ?
పూర్వకవుల్పెక్కుసార్లిచ్చినట్టి ని
తంబినీ బిరుదానఁ దమకమేమొ?
'ఆతపచ్ఛాయ' (Sunshade) మాతపప్రౌఢిమఁ
జల్లార్చి శైత్యమ్ము సంగునేమొ?
పెదవిలత్తుక పట్టు చెదరకుండఁగ ముద్దు
లను గుల్కఁగా నేరు పెనయనేమొ?
ఎత్తుమడమ జోళ్లు—ఈషచ్చలన్ని తం
బములు—చిత్రితాతపత్రశోభ—
చర్మభస్త్రి కరాన—సరులను కురులను
సరుదుకొనుచుఁ దెన్నులరసికొనుచు,
పురము పార్కులోన భరమైన యెడఁదతో
వలపుగాని కొరకు వనరు నొకతె.

*



# ‘శిశు సంగీతం’ ★ శ్రీమతి కనకదిండి లలితాదేవి

దేశంలో ఏ ప్రాంతంలోనైనా, తల్లులకు, పిల్లలకు వుండే అనిర్వాచ్యమైన మధురప్రేమ, తమ పిల్లలను జోకొట్టటంలోనూ, మరి ఏ యితర పరస్పర జీవిత ఘట్టాలలోనైనా బాగా వ్యక్తమాతుంది. గ్రహించినట్లయితే శ్రీమంతుల సౌధాలలోనూ, అభాగ్యులైన బీదల గుడిసెలలోనూ, యదార్థమైన స్త్రీయొక్క మాతృహృదయం వ్యక్తమాతుంది.

ఏ తల్లికీ పాటలు మాటకట్ట నక్కరలేదు. ‘నిద్రపో నాతండ్రి’ ‘నా అందాల భరిణె’ చందమయినవి, ఏ దేశంలోనయినా, తల్లికి పిల్లలకు అర్థమయ్యే భాషలో కొద్ది తేడాలలో వినిపిస్తూనేవుంటాయి. సంతోషానందాల్నిచ్చే స్వల్పాల్పమైన యీ బాల సంగీతాలు వంశపారంపర్యంగా హెచ్చివచ్చినాయి.

ప్రాచీనకాలంలో ఏ తల్లియో అల్లిన యీ అర్థహీనమైన యీ మాటల పాటలు, యిప్పుడు వినిపించేవాటికన్నా ఎక్కువ సజీవములై, ప్రాకృతములుగా శాంతినిస్తాయని నా నమ్మకం.

యీ చిన్నిపాటలు హృదయంగమంగా, అతి మృదువుగా, పూర్తిగా స్త్రీ హృదయము వెదజల్లుతూంటాయి. యీ లాలిత్య హృదయంతో పురుషుడెప్పుడూ యిట్టి పాటలు ప్రయత్నించిన గౌరవానికి పతితుడైనట్లు వినబడదు. యెంత విచారంలోవున్నా, వితంతువుకు సహితం, స్నేహమోహపాత్రమైన యీ పాట వినపడగానే హృదయం చల్లబడుతుంది.

యివి ప్రప్రథమంలో ఒకటి అయినా, తల్లి యిష్టప్రకారం వేరువేరు రూపాలు సృజిస్తూ, స్వేచ్ఛాస్వప్నకలశాలుగా, మాతృప్రేమారసరాగాలుగా ప్రవహిస్తాయి. మితిమీరిన వుత్సాహంతో, సూక్ష్మమై, నిశితమైన హాస్యంతో, ప్రేమతో మిళితమై యుంటాయి, వికసిస్తాయి. యిటువంటివి చాలామంది మచ్చుకు రుచిచూచే వుంటారు.

చిన్న నా అబ్బాయి ఆడపో తేనూ
ఆడబోయినచోట మాడ దొరికింది
మాడ అమ్మాయికి మద్దికాయల్లూ
కలవారి పట్టనీ గారాబమన్నీ
కంసాలి పెట్టనే కాలి యందెల్లు.

చిన్నచిన్న హస్తాలతో వస్త్రాదులా సుడులు విడుస్తూ, కాళ్లు, ముంజేతులు చురుగ్గా విరుస్తూ, ఆఖరుకు ముఖాన్ని అవ్యక్తమైన ఆనంద దివ్యాలోచనాలుగా వెలిగిస్తాడు.

పల్లె జీవితాలలో మల్లెలు కురిపించే యీ పాటలుంటాయని ఎవరనుకుంటారు? చింకిరి వంకర చీరల వుయ్యాలల్లో గాలి బిడ్డలకు ప్రకృతి శ్రుతులలో వెల్లివిరిసిన బాలకర్ణామృతం ఎంత కడుపునింపుతుంది? భావ సౌధాలలో సుధలూరగించే తన్మయత్వమూ, సముద్ర నిర్ఘోషణములతో స్నిగ్ధగంభీరమైన వాయుజీవనం పావనం—యివి గాలికన్న తేలికగా చల్లగా మెల్లగా హృదయాలకు—

అమ్మాయి కూర్చున్న వేదికలమీద
కిన్నరులు మీటుదురు కన్నెలిద్దారు
కారాలలో కెల్ల రెండు కారాలు
వుప్పు కార మొకటి ఉపకార మొకటి
వాసాలలో కెల్ల రెండు వాసాలు
రాణివాసా మొకటి విశ్వాస మొకటి
కుంటల్లలో కెల్ల రెండు కుంటల్లూ
వడ్లకుంటా వొకటి వైకుంఠ మొకటి.

యింకా పిల్లలకు ప్రతిదినమూ స్నానం చేయించే సమయంలో వాళ్లు వేరే ధ్యానంలో, కళ్లల్లో మెరపులతో, మృణాళాల్లాంటి చేతులతో తృణీకరిస్తూ, మనస్సు తస్కరింపబడి, చటుక్కున మాటు మణిగి—

కోకిల్ల బిడ్డల్ల కొని తెచ్చి కాకి
కొట్టక, తిట్టక గుట్టున్న పెంచె
రెక్కలొచ్చేవరకు చెప్పకపోయె—
వెండి కొండలమీద వేటకుబోయె
అప్పన్న చెవులవే గొప్ప ముత్యాలు
జూదమాడీ మంగ జూకీల కడుగు
అలివేలు మంగమ్మ ఆడిన్న పసుపూ
అప్పన్న కోనేట తెప్పలై పారు
మల్లన్న కోనేట మడుగులై తేలు.

బాల కేలుపులకు వస్త్రాభరణాల వేళల సహితం, సంగీతం సంహితం కావలసిందే. అట్టి సంగీతం కొరవైతే, బాలవేదపాఠాలకు సంత వ్యర్థమై, దశమరసం శృతిగా నివేదితమాతుంది. వెంటనే—

చిన్న నా అమ్మాయి చీరకేడుస్తే
నెయ్యరా సాలీడ నేత్రాన పట్టూ
మురుస్తూ సాలీడు ముమ్మూళ్లు నేసు
నవ్వుతూ సాలీడు నాలుమ్మూళ్లు నేసు
అందాల ఆచాకి ఆర్నెల్లు వుతుకూ
వేడుకతో అమ్మాయి వెయ్యేళ్లు కట్టూ.

సమయాసమయాలలో ఆహారపానీయాలు ఆరగించటానికి ఆహ్వానిస్తే, విచిత్రంగా సత్యాగ్రహం చేస్తూ, స్వతంత్రయాత్రకు ప్రారంభంగా తన సంసార ఆహారసామగ్రితో, తన అచేతనపరివారంతో ఆజ్ఞలిస్తూ, సామాన్యపు సరసస్వరాలకు చొక్కకపోతే సాదృశంగా—

జోగడాల చీరెమ్మ దండుమారెమ్మా
కత్తిపీటకు బోయి కయ్యాలు దెచ్చూ
జోగడాల చీరెకీ చావులేదన్నీ
జాబులంపీనాడు యమధర్మరాజు
నువ్వు చస్తేకాని నే చావనన్నీ
మారుజాబులంపు ఢిల్లీ సుల్తానీ—

భ్రాతృభగినుల పరస్పరోత్పన్నమగు ప్రేమజ్యోతులు నిత్యకృత్యాలలో నింగిచూస్తూ,—ఆప్యాయంగా—

ఎండలో వున్నవి రెండందలాలు
ఎవ్వరందలమనీ నే తొంగిచూతు
అన్న అందలమనీ అరుగెక్కిచూతు
తమ్ము డందలమనీ తలుపెక్కిచూతు.

బాలుర భాషించే వింతస్వరాలు, వాళ్లు కురిపించే వక్రస్వరూపాలకు వ్యాఖ్యానాలు వ్రాయటం దేవుడికొక్కడికే సాధ్యం. అది దేవభాష. అప్రయత్నంగా అందమయినవి, ఆనందమయినవి తారసించినపుడు అర్థంగాకుండా వ్యర్థమౌతాయి. ఇది మేనమామలమీద చక్కని శ్లేషతో చెప్పబడింది.

అందరికి మావల్లు చందమావల్లూ
అబ్బాయి మావల్లు అందాల సుందరులు

ముద్దు వచ్చేనమ్మ మేనమామలకు
అద్దమయి తోచెనే అబ్బాయి మొగము
మాటలెన్నాడినా మనసు కలువాదూ
మంచెంత కురిసినా చెరువు నిండాదూ.

పాశ్చాత్యానుకరణాలుగా చాలా మనదేశంలో ప్రాదుర్భూతములగుచున్నా అవి మనదేశంలోని సాంప్రదాయకమైన జీవితాలలోని వరుసలకు గతులకు భేదిస్తున్నాయి. ఎక్కడివైనా, ఏ భూమియందైనా, శక్తిసంజీవులై, రసోత్కృష్టములై, జీవప్రచారాలు గలిగించిన యీపాటల తల్లులు శతాబ్దాలుగా వందనీయులు.

ముఖ్యంగా మనదేశంలో కలిగే ఆనందోత్సాహాలు పిల్లలకు మరి ఏ యితర ప్రపంచంలోనూ విశాలంగా లేవు. తల్లితండ్రులు మతసాంప్రదాయాల మన్ననలతో, పిల్లల భవిష్యత్తు ప్రేమతో, సౌభాగినేయులుగా పండించాలని చాలా చాలా 'నామకరణం' 'అన్నప్రాసన' 'పుట్టువెంట్రుకలు' 'అక్షరాభ్యాసము' మొదలగునవి తాళమేళాలతో, సందడి విందులతో చెందచేస్తారు.

పల్లెపట్టణాలలో హాస్యరసజనితమైన అనేక యాటలపాటలతో, కమ్మని బొమ్మలతో, పాడుతూ, పడుతూ ప్రేమప్రపంచంలో ప్రయాణంచేస్తారు. పల్లె జీవనాలలో, తల్లి ఏ చల్లని చేలల్లోనో, కష్టఫలము కంటున్నపుడు, వస్త్రాల టుయ్యాలలలో, సల్లాపవుల్లాసములాడు వీరు భావికాలములకు అలంకారములగుదురుగాక.



అగౌరవించే అత్యాస్తికత్వంకంటె, దేవుడిమీద యే అభిప్రాయముంచుకోని నాస్తికత్వం మేలు. లోకవిషయాలకి దృష్టినుల్లించి నాస్తికత్వం ధర్మానికి దారితీస్తుంది, మతం లేకపోయినా. అతి ఆస్తికత్వం అలాగాక మూర్ఖత్వంతో, తల్లకిందుల సమాధానాలతో, గందర గోళానికి దారితీస్తుంది.

పిచ్చినమ్మకాలకి (Superstitions) కారణాలివి:-తుచ్ఛానంద దోహదాలైన కర్మకాండలు, వుత్సవాలు; అమిత బాహ్యాడంబర ప్రధానమైన దైవారాధన; సంప్రదాయాలంటే అతిగౌరవం; స్వలాభ పరాయణులైన ధర్మకర్తల కుతంత్రాలు; పరిమిత విషయాల్లో దివ్యవిషయాలు వూహించుట; విపత్తులతో నిండిన అనాగరిక కాలం...... ........

—బేకన్

# ★ నక్షత్ర ఫలితాలు

కవికలహంసి
శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవి

## చైత్రమాసము

### అశ్విని
గొప్ప అధికారము; శస్త్రచికిత్స; భయం

### భరణి
పురాణశ్రవణం; ద్రవ్యప్రాప్తి; గౌరవము

### కృత్తిక
తేజస్సు; కార్యసిద్ధి; సాహసకార్యములు

### రోహిణి
స్వల్పాధికారం; మాతృసౌఖ్యం; విద్యాభివృద్ధి

### మృగశిర
చిత్తశుద్ధి; వెండి బంగారు వ్యాపారములో లాభం; కళాపోషణ

### ఆర్ద్ర
తాపజ్వరం; ఎఱ్ఱధాన్యముల వ్యాపారవృద్ధి; కళ్యాణం

### పునర్వసు
సంతోషం; ఉత్సవాదులలో వ్యయం; శాస్త్రచర్చ

### పుష్యమి
యుద్ధభయం; విశేషఖర్చు; ఆహ్లాదం

### ఆశ్లేష
నల్లవస్తువులలో లాభం; పరిచర్య; కలహం

### మఖ
నూతనకృషి కనుపడుట; సంచారం; మిత్రసహాయం

### పుబ్బ
గ్రామాంతరవాసం; ఉత్సాహం; విద్వద్గోష్ఠి

### ఉత్తర
విద్యాభివృద్ధి; నూత్న వస్త్రలాభం; ఇష్టసిద్ధి

### హస్త
ప్రయాణం; చింత; ధనవ్యయం; దుఃఖం

### చిత్త
రోగనివృత్తి; వాణిజ్యం; గురుభక్తి

### స్వాతి
స్ఫోటకం; అలసత్వం; పుత్రసౌఖ్యం

### విశాఖ
దేశసంచారం; ప్రభుసహాయం; ధనప్రాప్తి

### అనూరాధ
యుద్ధభయం; దుష్టసహవాసం; సౌఖ్యహాని

### జ్యేష్ఠ
లోహ వ్యాపారలాభం; శునకభయం; త్రిప్పటలు

### మూల
కార్యవిఘ్నం; బంధునాశనం; ఆయుధభయం

### పూర్వాషాఢ
ధనాగమనం; పితృసౌఖ్యం; నూతనస్నేహం

### ఉత్తరాషాఢ
అధ్యక్షత; ఉద్యోగలాభం; పాపభీతి

### శ్రవణం
మనశ్శాంతి; విపరీతవ్యయం; కళత్రరోగం

### ధనిష్ఠ
స్త్రీ మైత్రి; క్రయవిక్రయం; విచారము

### శతభిషం
మేహరోగం; వ్యాజ్యము; అపవాదు

### పూర్వాభాద్ర
ప్రయాణములో కీడు; పుత్రక్లేశం; సంపద

### ఉత్తరాభాద్ర
వేదాంతవిచారణ; బంధువిరోధం; శిరోవేదన

### రేవతి
భూలాభం; చిక్కులు; సంతుష్టిలేమి




## తొలిపలుకు

సౌందర్యపోషణ విషయమై శ్రద్ధతీసికొనని స్త్రీలు భూగోళమునం దేమూలగాని ఏయుగమందు గాని లేరు. కవి హృదయ చిత్రితమగు జగన్మోహన సౌందర్యమందలి విలువ తగ్గకుండునట్లు ప్రకృతి బహు జాగరూకతతో దాని నే కొద్దిమందికో ప్రసాదించుచున్నది. ఐనను తనకున్న సౌందర్యము చెడకుండుటకును దానిని వృద్ధిచేయుటకును పోషణ యవసరము. సౌందర్యపోషణవిషయమై శ్రద్ధతీసికొనినచో 'సాధారణ' యువతులు ఆకర్షణీయమగు సౌందర్యమును బడయుటకెంతయు సాధ్యము.

సౌందర్యమనునది ఒక ముఖమునకుగాని, చర్మమునకుగాని, మరే యితర ప్రత్యేకావయవమునకు గాని చెందినదికాదు. సర్వాంగసౌష్ఠవమగు శరీరమే సౌందర్యనిలయము. అట్టి శరీరమును బడయ ప్రయత్నించుటయే సౌందర్యపోషణ. సౌందర్యపోషణ యనునది నిజముగా ఆరోగ్యపోషణ శబ్దమునకు మారుపేరు. ఏలన ఆరోగ్యభంగకరమగు ప్రతియొక్కటియు సౌందర్యభంగకరము కాకమానదు.

సృష్టిని సరిదిద్ద బ్రయత్నించుట యసాధ్యమనిగాని, నిష్ఫలమనిగాని యెంచదగదు. అరణ్యమందలి పూపాదకును, తోటమాలిచే పోషింపబడ్డ పూపాదకును భేదములేదా? కలదు. సరిదిద్దుటకును ఒకహద్దుకలదు. ఆహద్దు మీర ప్రయత్నించుట ఓటమి నాహ్వానించుటయే. ఈ హద్దును మనమునందిడుకొని సౌందర్యపోషణ విధానము లీ క్రింద తెలుపబడినవి. వాటిని తగు జాగరూకతతో యనుసరించినచో సంతృప్తికరమగు ఫలితము బొందుట నిస్సంశయము.

## స్నానము

సౌందర్యము చాలవరకు శరీరపారిశుధ్యముపై యాధారపడియుండును. శరీర పారిశుధ్యమునకు స్నానము ప్రథమ ఘట్టము. మలబారు స్త్రీలకున్నంతశ్రద్ధ స్నానమందు మరే యితర స్త్రీలకును లేదు. మధ్యమ తరగతికి జెందిన కుటుంబములలోని పెక్కుస్త్రీలు నిత్యము శిరస్నానముచేయుదురు. శరీరమునకు తైలము బాగా వాడుదురు. దినమునకొకసారి కంఠస్నానమును వారమునకొకసారి శిరస్నానమును యవసరము.

స్నానముచేయుటచే చర్మముపైనుండి మురికిపోయి కాంతివంతముగ కానవచ్చును. అంతియకాదు. నీరు శరీరమునకు తాకగనే చర్మము తక్షణమే క్రుంగును. అట్లు క్రుంగుటచేయందలి రక్తము వెనుకకు నరముల

పైకిని, లోపలి యితరశరీర భాగములమీదికిని చిమ్మబడును. చర్మసంబంధ రక్తనాళములందును, గుండె యందును రక్తప్రవాహ మతిశయించును. అందుచే చర్మమునకు కాంతి, నరములకుబలము, జీర్ణకోశమునకు పుష్టి, తన్మూలమున సౌందర్యము వృద్ధిజెందును. ఈ ఫలితము నొందుటకే యనేకవిధములుగ స్నాన మాచరింతురు.

చన్నీటిస్నాన మన్నిటికంటె శ్రేష్ఠము. దుర్బలులు వేడినీటి స్నానముచేయుట మంచిది, అందు వలన శరీరమందలి వేడిగదల్చబడి చెమటరూపముగ బయటికివచ్చును. మిక్కిలి వేడినీటి స్నానముచేయుటచే రక్తనాళములకును గుండెకును హానికలుగును. ఆరోగ్యదాయకమైనను సముద్రజలము శరీరకాంతికి చెడుగు దెచ్చును.

శరీరమునకు కుంకుడుకాయ వీలయినంత తక్కువగావాడుట మంచిది. దానివలన చర్మము పెళుసు బారును. కొన్ని చర్మములు నల్లబడును. పెసరపిండి, సీకాయలవలన చర్మమందలి మృదుత్వముచెడదు. స్నానమునకు తక్కువఖరీదు సబ్బుల నుపయోగించినచో అందుండు మలినపదార్థములు చర్మమునకు చెడుగు చేయును. అట్లే మిక్కిలి సువాసనగ నుండవలయుననియు, మంచి రంగుగలిగి యుండవలెననియు చేసిన సబ్బు లలో రంగుపదార్థములు, అత్తరులు హెచ్చుగనుండుటచే నవియును శరీరమునకు హానిచేయవచ్చును.

పూర్వము హిందూ సుందరులు పన్నీట జలకమాడినట్లు కథలలో మనముజూతుము. అనగావారు సుగంధజలములలో స్నానమాడిరన్నమాట. అట్టి పన్నీటిస్నానమునకు లోషనులు బజారులో పలువిధము లయినవిగలవు. అందు శరీరకాంతికి దోడ్పడునదియు, ముఖ్యముగ కాంతివిహీనమై, పెట్లిపోయియున్న చర్మ మునకు గుణమిచ్చునదియునగు లోషను నీ క్రిందివిధముగ జేసికొనవచ్చును. ఆరౌన్సులపన్నీరు, ఒకఔన్సు గ్లిసరిను, ఒకచిన్న చెంచాడు బోరక్సుపొడి, ఒకఔన్సు ఆల్కహాలు, ఒకఔన్సు బెంజాయనుద్రవము, వీటి నొక సీసాలోకలిపి వారముదినములుంచి యనంతర ముపయోగింపవలెను.

## పరిశ్రమ-విశ్రాంతి

పరిశ్రమ శరీరమునకు సౌందర్యముచేకూర్చును. పరిశుభ్రమగు గాలిలో వేగముగనడచు యలవాటు మిక్కిలి యాచరణీయము. ఇందువలన శరీరము కాంతివంతమై చురుకుగలిగియుండును. స్థూలకాయుల యందుగల క్రొవ్వును కరగించి పలుచనిశరీరము నొసగును. బహు పలుచగాయున్నవారికి కండపట్టును. దాసీలు కలరుగదా యని యింటిపనులుచేయకయు, ఆచారవిరుద్ధ మని యిల్లుదాటి బయట తిరుగాడకుండు టయు క్రొవ్వును పెంచుటకు కారణములై సౌందర్యమును చెఱచును.

శరీరము కృశించినట్లుండి వయసుకుతగినంత బరువులేక నిస్సత్తువగాయుండువారికి ఊపిరితిత్తుల పరిశ్రమ చాల యుపయోగకరము. పరిశ్రమచేయబూను వనిత బిగువుగనున్న తన వస్త్రములసడలించి, గృహమందే పరిశ్రమ చేయబూనినచో, బాగుగ తెరవబడిన కిటికీవైపు ముఖమిడి నిలువవలెను. రొమ్ము బాగుగా ఉబుకునట్లు ఊపిరితిత్తులు పట్టగలిగినంతగాలి నెమ్మదిగా ముక్కుతోపీల్చవలెను. నిండిన తరువాత కనీసము రెండుసెకనులు ఊపిరి బిగియబట్టి ఊపిరితిత్తులు వీలయినంతవఱకు ఖాళీయగునట్లు గాలిని నోట

మెల్లగా విడువవలెను. కొన్ని సెకనులాగి మరల గాలిని పీల్చవలెను. నీరసస్థితిలోనున్నవారు తక్కువగాలిని పీల్చి తక్కువకాలమే ఊపిరినిలిపి యంతకంతకు దీర్ఘశ్వాస నలవఱచుకొనవలెను.

సౌందర్యమునకు పరిశ్రమ యెంతయవసరమో విశ్రాంతియు అంతే యవసరము. ప్రపంచమందలి మంచినిచూచి సంతోషించుట యలవఱచుకొనుము. నీ ముఖము కాంతివంతముగ నుండును. మనసును విచారమునకు లోబడనీయకుము. నీ ముఖకాంతినశించును. వీలయినప్పుడు పగలైనను, కండ్లుమూసుకొని పదినిముషముల పాటు శయనించుము. నిద్రపోనక్కరలేదు. కాని ప్రతి యవయవమును, కండరమును, మనస్సును సడలి పోనిమ్ము. దానివలన నీ వనుకొనినంతకంటే యెంతయో హెచ్చు విశ్రాంతి చేకూరును. ఆరోగ్యము, సౌందర్యము కాపాడుకొనుయువతి దినమున కెనిమిదిగంటలు నిద్రపోవలెను. అందును నడిరేయికి ముందు ఒకగంట నిద్ర, నడిరేయిదాటిన రెండుగంటలనిద్రకు సమానము. నిద్రలేకున్నచో సౌందర్యపోషణకై చేయు యితర ప్రయత్నమంతయు నిష్ఫలమగును. కాని నడిమివయస్సులో హెచ్చు నిద్రపోవుటచే శరీరముస్థూలమై అందము చెఱచునని గుర్తెఱుంగవలెను.

ఏ కారణముచేనైనను, మితిమీరి శరీరమునకు బడలిక కలిగినచో, వీలయినచో తక్షణమే పైన చెప్పినట్లు 15 నిమిషములకాలము పరుండుము. తర్వాత పన్నీరుగాని, ఉడుకులోనుగాని కలిపిన వేడినీటి స్నానము చేయుము. శరీరమును తుడుచుకొని ఇష్టమున్నచో స్నోగాని, పౌడరుగాని, రెంటినిగాని యద్దుకొనుము. మనసు వికాసముజెంది సుందరవదన మేర్పడును.

## భోజనము

తారతమ్యమెఱిగి భుజించినచో సౌందర్యము నభివృద్ధి చేసికొనవచ్చును. మంచి శరీరకాంతి కలిగియుండగోరినచో ఎక్కువగా వేపడములు, హెచ్చు మసాలా ఉపయోగించుకూరలు, నిలువయుంచిన పదార్థములు, తీయనివంటకములు తినకుము. ఒకే భోజనమందు మితిమీరిన హెచ్చురుచుల దినకుము. భోజనముతోనేగాని వేరేమియు తినకుము. చిక్కని కషాయముతోచేసిన టీగాని, కాఫీగాని త్రాగకుము. త్రాగుడు కలవాటుపడకుము. మాంసమును పదేపదే తినకుము. హెచ్చుగాపాలు, పండ్లు, కూరగాయలు తినుము. నీరు త్రాగుము. పాలు జీర్ణముకానిచో సోడాతోకలిపిత్రాగుము. జీర్ణకోశమునందే యనర్థముగాని సంభవించినచో దాని ప్రతిఫలము చర్మముపై కానవచ్చును. హెచ్చు త్రాగుడుకును, విపరీత మాంసభక్షణకును యలవడినవారి కెప్పుడును సుందరవదనము లుండియుండవు. శాఖాహారముపై యాధారపడిన వారికున్నంతటి చర్మకాంతి మఱి యేరికినిలేదు. చక్కగా జీర్ణమగునట్టియు, చవుకగా తయారగునట్టియు యాహారమే నీకు చురుకైనచూపులను, చక్కని చెక్కిళ్లను ఇచ్చును.

స్థూలకాయులు తక్కువ భుజించుటచే సన్నబడరు. వారు క్రొవ్వుపదార్థములుగల వస్తువులను త్యజించవలెను. వరియన్నమునకు బదులుగా గోధుమయన్నము తినవలెను. దుంపలను తక్కువగా తినవలెను. మాంసమును మితముగా తినవచ్చును. కాని తీయని పిండివంటలను, చిక్కని పులుసులను వర్జించుటమంచిది. అట్లయినచో శరీరము పలుచబడి సుందరాకారమేర్పడును. (సశేషము)

—శ్రీ అలంపురం రాజు, బి. ఏ.



బాలీయువతులు — నాగనృత్యం

## ఆంధ్ర మహిళాగానసభ, రాజమహేంద్రవరము



అష్టమ వార్షికోత్సవ సందర్భమున—

అధ్యక్షిణి సుశీలాదేవిగారు, కార్యదర్శిని రంగమన్నారమ్మగారు, సభ్యురాండ్రు.

# చైనా స్త్రీ విద్యార్థులు

శ్రీ పరకాల పట్టాభి రామారావు
(అనువాదకుడు)

సంవత్సరాల తరబడి, సామ్రాజ్యవాదుల ధనతృష్ణచే నల్లమందు భాయీలకింద చేయబడిన చీనా జాతీయులు, ఈ రోజున అఖండమైన ధైర్యసాహసాలతో ఉజ్జ్వలచైతన్యాన్ని ప్రదర్శిస్తూ జపాను సామ్రాజ్యవాద దండయాత్రల్ని తరిమితరిమి కొడుతున్నారు. ప్రపంచాన్ని ఆశ్చర్యపరచే పోరాటశక్తిగా తయారైంది చీనాజాతి!

జాతీయ ఐక్యసంఘటన, జాతీయ స్వాతంత్ర్యం ముఖ్యాదర్శాలుగ పెట్టుకొని బ్రహ్మాండమైన ఉద్యమం సాగిస్తున్న చైనా విద్యార్థిసంఘాలే ఈ నూతనచైతన్యానికి కారణం అంటే—పరాధీన భారత దేశంలోని విద్యార్థి యువతీ, యువకులు తప్పక ఆశ్చర్యపడతారు!

'తమ మాతృదేశం సామ్రాజ్యవాద తృష్ణకి ఆహుతి అవబోతున్నది. తమజాతి దుర్భరమైన బానిసత్వం అనుభవించబోతున్నది' అనే భయంకర వృత్తాంతాల్ని వినటంతోనే...విద్యాలయంలో నాల్గుగోడల మధ్యనే ఉండలేకపోయారు చైనా విద్యార్థులు! వ్యక్తిగతమైన అభివృద్ధినైనా త్యాగంచేసుకొని—అంటే తన విజ్ఞానసాధననైనా కొంతవరకు తగ్గించుకొని—తమ జాతి స్వాతంత్ర్యంకోసం, తద్వారా ప్రపంచంలో స్వాతంత్ర్యాన్ని రక్షించేకోసం ముందంజవేసి ప్రపంచంలోని యువతీ యువకులికి ఆదర్శం చూపెట్టారు చీనా విద్యార్థులు!

యుద్ధం రావటంతోనే, విద్యార్థిసంఘాలు చేసిన మొట్టమొదటి ప్రయత్నం ప్రస్తుత విద్యావిధానాన్ని మార్చి, అందులో ఉండే లోపాలు తీసివేసి, అప్పటి పరిస్థితులకు అనుగుణ్యంగా తయారుచేయటం!

దేశమంతా ధ్వంసమైపోతూంటే, జపాను విమానదాడులికి తట్టుకోలేక, పసిపాపలు, తల్లులు, తండ్రులు చనిపోతూంటే... దేశానికి 'ఆయువుపట్టు' అయిన యువతీయువకులు, కాలేజీల్లో ఏ షేక్స్పియరో వల్లిస్తూ, ఏతర్కశాస్త్రమో మెదడులోకి ఎక్కిస్తూ, క్లబ్బుల్లోను, టెన్నిస్ కోర్టుల్లోను కులాసాజీవనంగడపుట—దేశానికి మహాద్రోహం చేయటమే అని తెలుసుకొని తమ జాతీయకర్తవ్యాన్ని, తమ బాధ్యతని గుర్తించారు చీనా విద్యార్థులు!

విద్యార్థులు తమ ప్రయత్నంవల్లనే విద్యాశాఖమీద వత్తిడి తీసుకొచ్చి విద్యావిధానంలో మార్పును తీసుకురాగలిగారు!

కళలకు ఉండే ప్రాధాన్యతని కొంత తగ్గించి సైన్సు, పరిశ్రమలు, జాతీయ పునర్నిర్మాణము, సైనికశిక్షణ, వైమానికశిక్షణ, వయోజన విద్యాప్రచారము మొదలైనవి ఈ కొత్త ప్రణాళికలో అత్యంత ప్రాముఖ్యతవహించినాయి. ఈ మార్పువలన విద్యార్థుల జీవితంలో అద్భుతమైన మార్పు కలిగింది. అంతవరకు డిగ్రీలు తీసుకొని, తనంత తనకేకాక, దేశానికిగూడ ఎందుకు వుపకరించలేని విద్యార్థులు, విద్యార్థినులు—జాతీయ స్వాతంత్ర్యపోరాటంలో ధృవతారల్లాగ మెరిసిపోతున్నారు! ఈరోజున చైనాదేశం పోరాటాన్ని సాగిస్తోందంటే...ఈ వీర పుత్రికాపుత్రులే...ఆధారం!

## కళాశాలలు : విద్యాలయాలు

అమాయిక మూగప్రజలమీద విమానదాడి జరిపి మారణహోమం చేస్తూండటమే కాక—జపాను సామ్రాజ్యవాద ప్రభుత్వం చీనాదేశంలోని యూనివర్సిటీలు, కాలేజీలు, హైస్కూళ్లు, లేబొరేటరీలు, లైబ్రేరీలు ఒకటేమిటి అన్ని విజ్ఞానకేంద్రాల్ని నేలమట్టం చేసివేసింది!

రబ్బరు బంతిని ఎంతగట్టిగా క్రిందికి అదుముతే అంత పైకిలేస్తుంది. మేల్కొన్న చీనా యువతీ యువకుల విషయంలోకూడ ఇది సత్యమైంది. వారి పట్టుదల, కార్యోత్సాహం, స్వాతంత్ర్యదీక్ష జపాను యుద్ధరాక్షసిమీద కసి రెచ్చగొట్టటానికే ఈ అమానుష జపాను కృత్యాలు ఉపయోగపడినాయి.

బయటి ప్రపంచంతో సంబంధంలేకుండా అంధకార జీవితాల్ని గడుపుతూండే రాష్ట్రాల్లోకి, కొన్నివందలమైళ్లు దేశమధ్యానికి చైనా విశ్వవిద్యాలయాలు, విజ్ఞానకేంద్రాలు మార్చబడినాయి. కొండలు, గుహలు నివాసయోగ్యంగా చేసుకొని అక్కడే విద్యార్థులు, ఉపాధ్యాయులు స్వంతంగా భవనాలు పరిశోధనాలయాలు నిర్మించుకున్నారు. విద్యాశాఖకు, పరిశోధనాలయాలకు కావలసిన అన్ని యంత్రపరికరాల్ని తయారుచేయటం ఒక ముఖ్యపరిశ్రమగా విద్యార్థులే పూనుకుంటున్నారు. విద్యార్థులు ఈవిధంగా దేశమధ్యనున్న రాష్ట్రాలికి తమ విజ్ఞానకేంద్రాల్ని మార్చటంవలన, అంతవరకు యుద్ధం జరుగుతూందనికూడా తెలియని ప్రజలు...అన్నివిధాల బాగుపడి, జాతీయ కర్తవ్యం ప్రబోధింపబడి, యుద్ధరంగాల్ని గోరిల్లాగుంపులతో నింపుతున్నారు. ఈ భాగాల్లో విద్యార్థులు నివసిస్తూ ఒక కొత్తజీవనం ప్రజలకు ప్రసాదించారు.

ప్రతీ రాష్ట్రంలోను, స్త్రీ విద్యార్థినులు విద్యార్థులకు పరస్పర సహకారం చూపటమే కాకుండ ప్రత్యేక విషయాలకోసం తమంత తాము సంఘాలు నిర్మాణంచేసుకుంటున్నారు.

చీనాలో ఏ సంఘాలు, ఎన్నెన్ని వేదికలు ఏర్పరుచుకుంటున్నా, మొట్టమొదటి ఆశయం—జాతిని నిద్రావస్థలోనుండి మేల్కొలుపటము, జాతీయ కర్తవ్యాన్ని ప్రబోధించి, విప్లవచైతన్యాన్ని కల్గించి, స్వాతంత్ర్యపోరాటాన్ని తీవ్రంగా సాగించుటమూను.

'సోదరీ! అసాధ్యం అనుకోకు...సాయశక్తులా పనిచెయ్!' ఇదే చైనా స్త్రీ విద్యార్థులిచ్చే నినాదం!

తమ సంఘంలోని ప్రతీ యువతీ కష్టజీవితాన్కి అలవాటుపడటం—మంచి ఓర్పు, సహనము, పట్టుదల కలిగిఉండటమూ...మొదటి ఆశయం!

'ఎల్లాంటి మొరటుభోజనమైనా సరే మేము తీసుకుంటాం. చవకనారబట్టలే మాకు చాలు. చలికాలంలో మాకందరికి నూలుదుస్తులైనా లేవు! అందరు బాగా చదువుట, వ్రాయుట, యుద్ధం చేయుట...నేర్చి ఉంటాము. ఎంతదూరమైనా మా సామగ్రి మేమే మోసుకొనిపోగలం...బియ్యం, కాబేజీ, బొగ్గులు, పలకలు, పుస్తకాలు, నాటకం తెరలు అన్నీను!

'ఇవ్వాళ విద్యాలయమే రేపు యుద్ధరంగం కావచ్చు. అందుచేత అన్నివిధాల మేము సంసిద్ధంగా ఉంటాము.'

'స్కూలుగంటే...విమానదాడి రక్షణగంటగా ఉపయోగిస్తాం. గుహల్లో ఉన్న మా విద్యాలయాలే, విమానదాడి రక్షణస్థానాలుగా మార్చివేస్తాం!' అని.

విద్యార్థులు, విద్యార్థినులు చేసే వీర కార్యకలాపాలు, వేడిరక్తం పొంగిపోతూ, వీరకంఠాలతో వారు పాడుతూండే జాతీయగీతాలు, యుద్ధరంగంలో ఆవేశంతో ఒళ్లుమరిచి వారు యుద్ధంచేసే విధానా చూచి, విని చీనా జాతీయనాయకులు, చీనాజాతి, 'మా విద్యార్థి యువతీ యువకులే మా దేశానికి జీవం, సర్వస్వమూను' అని పొంగిపోతూంటారు! ప్రపంచానికంతకీ గర్వంతో చాటుతూఉంటారు!

## వయోజన విద్య

యుద్ధసమయంలో, విద్యార్థుల కృషిఫలితంగా వ్యాప్తిచెందిన గొప్ప ఉద్యమాల్లో వయోజన విద్యాప్రచారం ఒకటి!

1936 లో చీనాదేశంలో 20,00,00,000 మంది నిరక్షరకుక్షులుండేవారు. ఒక సంవత్సరన్నరలో 10 కోట్లమందికి పైగా 1,200 మాటలు కలిగిఉన్న ప్రాథమిక భాషాజ్ఞానం పొందారు. ఒక సంవత్సరన్నరలో విద్యార్థులు ఏ నాగరిక దేశంలోను రాని మార్పును తీసుకొచ్చారంటే—ప్రపంచం అంతా ఆశ్చర్యపోయింది!

వారి వయోజన విద్యాప్రణాళికలో చదవటం వ్రాయటమే కాకుండ, ఆరోగ్యసూత్రాలు, వాయు విమానదాడిరక్షణ, దేశచరిత్ర, జాతీయ ఉద్యమంగూర్చి పాటలుకూడా ఉంటాయి. చైనా విద్యార్థులు కనిపెట్టిన ఇంకొక క్రొత్తవిధానం పడవమీద ఏర్పరుపబడిన 'సంచారవిద్యాలయం'. ఈ బోటుస్కూల్లో...

(1) యుద్ధం గురించిన సినిమా ప్రదర్శనాలు. (2) యుద్ధరంగం గురించిన రేడియో సంభాషణలు, గీతాలు. (3) మాజిక్ లాంతరు ప్రదర్శనములు. (4) విద్యావిషయికమైన ఫిల్ములు. (5) నడివీధి టీ షాపుల్లో జరిపే సంభాషణలు. (6) నాటకప్రదర్శనాలు. (7) గోడ వార్తాపత్రికలు, చార్టులు. (8) వ్రాత, చదువు, బోధన—వీటికి కావలసిన సాధన సామగ్రులు అమర్చబడి వుంటాయి.

ఒకరాష్ట్రంలో 9 నెలలపాటు ఇటువంటి ఒక బోటు స్కూలు సంచారంచేసి 1,50,000 ప్రజల్ని విజ్ఞానవంతులుగ చేయగల్గింది!

ఈ విద్యాప్రచారంలో అత్యద్భుతంగా ప్రజలకు ప్రబోధం చేయగల్గినది...ప్రాంతీయ భాషలలో వ్రాసిన చిన్నచిన్న నాటకప్రదర్శనలు. సజీవమైన వ్యవహారికభాషలో, వాస్తవికతత్వం ద్వారా జాతీయ సమస్యల్ని ప్రదర్శించి భావచైతన్యం కల్గించి చాలవరకు జాతిని మేల్కొలుపగల్గుతున్నవి విద్యార్థులచే ప్రదర్శింపబడుతున్న ఈ నాటికలే!

సామాన్యప్రజల్లోనే కాకుండ వేలకొలది విద్యార్థులు, బాలభటులు, గరల్ గైడ్సు (బాలసేవికలు) యువజన స్వచ్ఛంద సేవకులు చీనా సేనలతోపాటు తిరుగుతూ సైనికులకు విజ్ఞానప్రబోధం చేయుటయే కాక, అనేక విధాల సేవచేస్తున్నారు. గాయపడినవారికి ప్రథమచికిత్స చెయ్యటం, హాస్పిటల్లోకి మోసుకొనిపోవటం, వాయువిమానదాడి ఫలితంగా ఇల్లు వాకిలి లేకుండా అల్లాడుతున్న దీనప్రజల్ని, శిశువుల్ని శరణాలయాల్లో చేర్పించటం;—విమానదాడి జరిగినప్పుడు ప్రజల భయం పోగొట్టి, రక్షకభటుల్లాగ పనిచెయ్యడం; బాంబుల వలన తగలడుతున్న భవనాల మంటల్ని ఆర్పటం...అన్నివిధాల పాటుబడుతున్నారు.

భారతదేశంలోవలనె, చైనా స్త్రీలు చాల అంధకారంలో, అజ్ఞానంలో, అస్వతంత్రతలో మునిగి ఉండేవారు. నిరంకుశమైన సాంఘిక కట్టుబాట్లకి, మూఢాచారాలకి లొంగి బానిసజీవితాల్ని అనుభవించే వారు. భారత స్త్రీ వలనే పరాధీన జీవితాన్ని గడుపుతూ కృంగిపోయిన చీనా స్త్రీ జాతిని—అన్నివిధాల పైకి తీసుకొనివచ్చి కొద్దికాలంలో ఉద్ధరించగలిగినవారు స్త్రీ విద్యార్థులే!

ప్రతీ రాష్ట్రంలోను, స్త్రీలకు ప్రత్యేకంగా విద్యార్థినులు రాత్రి పాఠశాలల్ని, వయోజన విద్యా తరగతుల్ని కొత్తకొత్త పద్ధతులతో సాగిస్తున్నారు. శిశుసంరక్షణ, గృహకార్యనిర్వహణ, విమానదాడులు, విషవాయుప్రయోగం జరిగినప్పుడు సంరక్షించుకొనే విధానాలు బోధిస్తున్నారు.

## బాల ఉపాధ్యాయినులు

హైస్కూళ్లలో చదువుతూన్న 12_16 ఏళ్ల వయస్సుగల్గిన విద్యార్థినులు ఈ వయోజన విద్యా ప్రచారంలో అత్యంత శ్లాఘనీయమైన కృషి చేస్తున్నారు.

చైనా మహిళల్ని ఈ బాల ఉపాధ్యాయినులు నీడల్లా అనుసరిస్తారు. స్త్రీల నిత్యజీవితంలో కలిసి మెలసి ఉంటూ వారికి తెలియకుండానే వారిని విజ్ఞానవంతులుగ తయారుచేయటంలోనే ఉంది వీరి ప్రతిభ!

ఒక పన్నెండేళ్ల అమ్మాయి హాంగ్చో రాష్ట్రంలో తరగతులు నడుపుతోంది. ఒకరోజున వయసు మళ్లిన ఓ స్త్రీని తరగతికి తీసుకురాటానికి వెళ్లింది. అందంగా బైండుచేయబడిన ఓ చక్కని పుస్తకం చూపెడుతూ,

'అమ్మమ్మా, నువ్వు ఈ చక్కని పుస్తకం ఎందుకు చదవగూడదూ? నేను సాయపడతాను' అని అడిగింది.

'మంచిదానవు తల్లీ! ఇప్పుడింకేం చదువు? అరవై ఏళ్లొచ్చినతరవాత చదువుకోక మన్నుకొట్టుకోనా అన్నట్టు! రేపో యెల్లుండో వెళ్లిపోయేదానికి నాకు చదువెందుకమ్మా' అంది ఆ అవ్వ అమాయికంగా నవ్వుతూ.

కొంచం తల ఒంచి ఆలోచించి, ఆ పిల్ల రకీమని అడిగింది. 'మరి అల్లా అయితే ఈ ప్రపంచం వదిలిపెట్టి వెళ్లిపోయినతర్వాత ఎక్కడికి వెడదామని ప్లాన్ వేస్తున్నావ్?'

'బాగుంది, నేనెప్పుడూ పుణ్యమైన కార్యాలు, మంచిపనులే చేస్తూవచ్చాను. అందుచేత స్వర్గంలోకే వెడతాను!'

'అయితే, ఒకవేళ స్వర్గంలోకిపోయే గుమ్మంలో దేవకన్నెలు నుంచుని 'టేట్, ఇక్కడ సంతకం చేస్తేనే కాని లోపలికి వెళ్లకూడదంటారేమో! అప్పుడేంచేస్తావ్?'

'మంచిపిల్లవే, నీ యిల్లు బంగారంగాను, నేనెప్పుడూ ఇల్లా అనుకోలేదు! రేపటినుండి రోజూ మా యింటికికూడా వస్తూండు, నేనూ చదవటం నేర్చుకుంటాను' అని తడుముకోకుండా చెప్పింది జబాబు, ఆ వృద్ధమాత!

ఈ బాల అధ్యాపకులు తమ కర్తవ్యాన్ని ఎంత బాగా అర్థంచేసుకొని ఎంత తెలివి తేటలుగా నిర్వహిస్తారు! ఈ స్త్రీ విద్యార్థులే దేశంలో విప్లవచైతన్యాన్ని కలిగించి దేశానికి జీవమూ, సర్వస్వమూను అయి ఉన్నారంటే ఆశ్చర్యమేముంది!

—స్టూడెంట్స్ కాల్.




పిన్ని ఉత్తరాలు

# బీహారు రాష్ట్రము

సర్వమంగళా,

గంగానది హిమవత్పర్వతాల్లో పుట్టింది. అక్కణ్ణుంచి దిగి సుమారు పదిహేడువందల మైళ్లు భూమిమీదపారి, ఆఖరుకి సముద్రంలో కలుస్తోంది. గంగాదేవి హిమాలయ పర్వతాల్లో శివుని జుట్టుముడిలో ఉండేదనిన్నీ, భగీరథుడనే ఆయన చాలాకాలం తపస్సుచేసి ఆమెను భూలోకంలోకి రప్పించగలిగేడనీ ఓ కథ చెబుతారు. గంగ మనదేశంలోకి దిగడంవల్ల దేశానికి చాలా ఉపకారం జరిగింది. తాను ప్రవహించినంత మేరా, రెండుప్రక్కలా దేశాన్ని సువర్ణఖండంగా మార్చేసిందీ నది.

మన గోదావరినది పొడుగు అంతాచూస్తే తొమ్మిదివందల మైళ్లకంటె లేదు. గంగానదో! పదిహేడువందల మైళ్లు! ఈనది ప్రవహించే భాగాన్నంతనీ మూడురాష్ట్రాలక్రింద చేశారు. డెల్టాలోఉన్న వంగరాష్ట్రాన్నిగురించి నీకు వ్రాశాను. మిగతా రెండురాష్ట్రాలలోనూ ఒకటి బీహారు.

ఈ బీహారు రాష్ట్రంలోనే 'బుద్ధగయ' అన్న ఊరుంట. ఈ ఊరు బౌద్ధమతస్థులకు చాలాగొప్ప పుణ్యక్షేత్రం. బౌద్ధమతం గొప్పమతాలలో ఒకటి. దశావతారాలలో బుద్ధావతారం ఒకటి అని నీకు తెలుసు. ఆబుద్ధుడు కనిపెట్టిన మతమే బౌద్ధమతం. బుద్ధునికి తల్లితండ్రులు పెట్టినపేరు సిద్ధార్థుడు. ఆయన ఒకరాజు కొడుకు. ఆయన రోగాలు, ముసలితనం, ఇతర కష్టాలు-వీటివల్ల బాధపడుతోన్న మనుష్యుల్ని చూచి 'ఈ బాధలు లేకుండా ప్రాణులు సుఖించడం ఎలాగ?' అని ఆలోచించడం మొదలుపెట్టేడు. తన రాజ్యాన్ని, భార్యని, కొడుకునీ, అందర్నీ విడిచిపెట్టి తపస్సుకని వెళ్లిపోయాడు. ఎంతో శ్రమపడి తపస్సు చేశాడు. కాని ఆయనకి 'ప్రాణులు సుఖపడడం ఎలాగ?' అనే ప్రశ్నకి సమాధానం రాలేదు. తపస్సువల్ల లాభంలేదని, ఉపవాసాలూ, జపాలూ మానేసి ఓరావిచెట్టుక్రింద కూర్చుని ఆలోచించడం మొదలెట్టేడు. ఆయన ప్రశ్నకి బదులువచ్చింది. 'మనకువచ్చే కష్టాలన్నీ మనకు కల ఆశమూలాన్ని దాపురిస్తున్నాయి. ఈ ఆశను జయిస్తే మనకి కష్టాలు దూరమవుతాయి. ఈ ఆశమూలాన్నే మనం ఇతరులను కష్టపెడుతున్నాం.

ఈ ఆశను చంపివేస్తే ఇతరులకు మనవల్లకలిగే కష్టాలుకూడా ఉండవు.' ఇదీ సిద్ధార్థునికి కలిగినజ్ఞానం. ఈ జ్ఞానంవస్తే ఆ చెట్టుక్రింద కూర్చున్నప్పుడు. అందుచేత ఆస్థలం, పుణ్యస్థలం అయింది. ఆజ్ఞానం సంపాదించిన నాటినుంచీ ఆయనకి 'బుద్ధుడ'ని పేరొచ్చింది. ఆ ప్రదేశానికి 'బుద్ధగయ'అనే నామం కలిగింది.

జైనమతస్థులు ప్రాణహింస చెయ్యరని చెప్పేను. అలాగే బౌద్ధమతస్థులూనూ. బుద్ధుడు 'మనం కష్టాలు తెచ్చుకోకూడదు. ఇతరులకు తేకూడదు.' అని కదా చెప్పేడు? అందుచేత బౌద్ధమతస్థులు ఆహారానికైనా సరే ప్రాణహింస చెయ్యరు. జీవహింస పనికిరాదని చెప్పే బుద్ధుడు హిందువులు చేసే యజ్ఞాలను చెయ్యకూడదన్నాడు. 'యజ్ఞం' అంటే నీకు తెలుసా? పుణ్యంకోసమని మేకల్ని తీసుకెళ్లి బలి ఇవ్వడం. బుద్ధుడు 'పుణ్యం కావాలన్న ఆశను విడువండి. నోరెరుగని ప్రాణుల్ని హింసించకండి. యజ్ఞాలు మానండి' అని బోధించాడు.

బీహారురాష్ట్రానికి ముఖ్యపట్టణం పాటలీపుత్రం. దీనినే ఇప్పుడు 'పాట్నా' అంటున్నారు. పాటలీపుత్రం చాలాకాలంనుంచీ ఉన్నపట్టణం. గొప్ప చక్రవర్తులని పేరుపడ్డ చంద్రగుప్తుడూ, అశోకుడూ ఇలాంటివాళ్లందరి సామ్రాజ్యాలకీ ఇదే ముఖ్యపట్టణం.

సీతామ్మవారి తండ్రి జనకమహారాజు, రాజ్యంచేస్తూన్నా ఆచారబందీలో మునిగిపోక ఋషికి మల్లే ప్రవర్తిస్తో, తన ప్రజల సుఖంకోసమే రాజ్యాన్ని ఏలడానికి పూనుకున్నాడని నువ్వు చదువుకున్నావు. అశోకుడుకూడా అలాంటి చక్రవర్తే. ఆయన బుద్ధమతాన్ని పుచ్చుకున్నాడు. ఆశని చంపుకున్నాడు. ప్రతీ రాజుకీ తనరాజ్యాన్ని వృద్ధిచేసుకోవాలన్న ఆశకలిగి యుద్ధాలకి ప్రేరేపిస్తుంది. యుద్ధాలవల్ల ప్రాణులకు హింస కలుగుతుంది. హింసకూడదు. అందుచేత యుద్ధాలు మానెయ్యాలి. అశోకుడు యుద్ధాలు మానేశాడు. అంతేకాదు. ఏరాజులైనా యుద్ధానికి దిగుతోంటే, వాళ్లకి సంధికుదిర్చి యుద్ధాలులేకుండా చేశాడు. చక్రవర్తులెంతమందో పుట్టి చచ్చిపోయారు. అశోకుడు కూడా చనిపోయాడు. ఏమైతేనేమి, అతని కీర్తిమాత్రం నిలచిపోయింది.

అమ్మడూ, నీకీ నెలాఖరుకి పరీక్షలైపోతాయికదూ. వేసంగి సెలవుల్లో నువ్వు చెన్నపట్టణం వచ్చెయ్యి. ఇప్పుడు ఈ నగరంలో తెనుగువాళ్లకి ఓకొత్త విశేషం ఉంది. ఏమిటో తెలుసా? క్లబ్బు. మా యింటికి దగ్గరగానే ఉంది. అక్కడ చిన్నపిల్లలకి డాన్సూ, ఆటలు, పాటలూ-అన్నీ ఉన్నాయి. నువ్వూ, చెల్లాయీ రోజూ ఈ క్లబ్బుకెళ్లి, ఎంచక్క డాన్సు నేర్చుకుందురుగాని. ఏం?

చెన్నపట్టణం,<br>1.4.41. }

పిన్ని

పంపించింది పూర్ణమ్మ. 'అనంతగారు నాలుగురోజులు సెలవు పుచ్చుకున్నా'రని హెడ్డు గుమాస్తాగారు చెప్పారట'

'అదటండీ సంగతి! బస్సుస్టాండుదగ్గర మా ఆయనకి కనిపించారట అనంతంగారు. ఏమండోయి, యెక్కడికిప్రయాణం అని అడుగుతే శ్రీరామనవమి వుత్సవాలకి రాజమండ్రీ వెడ్తున్నాను. అబ్బా, పిల్లలు చంపేస్తున్నారండీ, రాజమండ్రీ తీసుకువెళ్లమని అన్నారట'.

'ఎంతయెత్తు వేశాడండీ అనంతం! పూర్ణమ్మ మేనమామ కొడుకూ వాళ్లూ వచ్చారా?'

'రాకేం. బండెడు సంసారంతోదిగాడు అనంతంగారింటికి. వాళ్లేరీ, స్టేషనుకువచ్చారే' అని అడిగింది పూర్ణమ్మ. మాకు కనిపించలేదే అన్నాడు ఆయన. పూర్ణమ్మగారు సిగ్గుపడిపోయింది. కొట్టుగది తాళాలు, మేడగదితాళాలూ—అన్నీ జేబులోపెట్టుకుని పారిపోయాడు అనంతంగారు. ఇదంతాచూసి కంగారు పడి మేనత్తకొడుకు 'యివాళకి హోటలులో భోజనంచేద్దాం. రేపు కొత్తగా యింట్లో ప్రవేసిస్తాము లేవే' అన్నాడట. పూర్ణమ్మగారు తలయెత్తలేకపోయింది'

'శాస్తి బాగా అయింది పూర్ణమ్మపిన్నికి. కుక్కకాటుకు చెప్పుదెబ్బ అన్నట్లుచేసాడు అనంతంకక్క'

## త్రిమూర్తులు

ఆధ్యాత్మిక జీవితానికి బ్రహ్మ, విష్ణు, మహేశ్వరు లెట్టివారో గృహజీవితానికి వంటలక్క, దాసీ, చాకలీ అట్లాంటివారు. సంసారం సాఫీగా జరిగిపోవాలంటే యీ త్రిమూర్తుల ప్రాపకం పూర్తిగావుండాలి.

వంటలక్క పూర్తిగాతలుచుకుందా వుడకనిపప్పూ, మాడినకూరా ప్రత్యక్షమవుతాయి. అర్థాకలి మూలాన్ని యింటాయనముక్కు ఎఱ్ఱపడి రుసరుసలు ప్రారంభమవుతాయి. శాంతంగా గడపవలసిన సంసారం వెగటుగా మారుతుంది. పోనీ, వంటలక్కని అదుపు ఆజ్ఞలలో వుంచుదామని మన అధికారం చెలాయించడం మొదలెడ్తే మర్నాడావిడ గయరు హాజరవుతుంది. ఈయిల్లుకాకపోతే యింకోటి, ఆవిడకులెఖ్ఖా ?.

దాసీ మనిషిమాట చెప్పనక్కర్లేదు. ప్రతీ గృహిణికీ అనుభవమే. సంవత్సరాదికి, సంక్రాంతికి కొత్తచీరలూ, మాటిమాటికీ పాతబట్టలూ, అప్పుడూ యిప్పుడూ పాత, కొత్తవూరగాయలూ——యింకా యివీ అవీ——ముట్ట జెప్పుతోంటేనేకాని దొడ్లో పోరుతప్పదు. కాస్త అదమాయించామా, రణగొణధ్వని అవుతుంది. పక్కయింటి పాపమ్మగారు ఆవీధి వీరమ్మగారిచెవులో వూదేస్తుంది, 'పత్యాలకి పాతవూరగాయేనా పడెయ్యదుట దాసీ దానికెప్పుడూ' అని.

చాకలిదానిమహిమ వెల్లడికానియిల్లు లేనేలేదు మన ఆంధ్రభూమిలో. దానికి అడపా తడపా పడెయ్యకపోతే, సృష్టే తలక్రిందులవుతుంది. మబ్బుగావుండడంవల్ల బట్ట లారకపోవడమో, అథార్థగా వచ్చినవర్షంవల్ల ఆరినబట్టలు తడిసి ముద్దలవడమో, యేదీ కాకపోతే అది రంగం పరారవడమో తటస్థిస్తుంది.

రంగమ్మ పోపుమాడ్చేస్తుంది; రాంపీ గిన్నెలమసి అలాగే వుంచేస్తుంది; రంగం బట్టలకి కొఱ్ఱు పెడ్తుంది. మన మతిపోతుంది......

ఈ త్రిమూర్తుల్ని కూడకట్టుకు రావడానికి యెంతో ప్రజ్ఞ వుండాలి. తరుచు పొగడాలి, వీలైనప్పుడు అదీ యిదీ పడెయ్యాలి, అప్పుడప్పుడు అదమాయించాలికూడాను.

కాని ఒకగులహా. 'పప్పు పుప్పుకషాయం చేసారు. ఇది యెల్లాతినడం' అనే బదులు 'చూడండి, రంగమ్మగారూ! కాస్త ఉప్పుతగ్గిస్తే పప్పు మరీకమ్మగా వుంటుంది'అంటే ఆవిడికి నచ్చుతుంది. 'నీకళ్లు గుడ్డిగాను. ఏమిటి, యింతమసి వుంచేసావు' అనకుండా, 'ఇల్లాగైతే యెల్లాగేరావి! మరి శుభ్రంగా తోవాలి పాత్రలు...అవును కాని, ఆ మూలపులును మూతపెట్టాను. ఎల్లాగుండే' అంటే దాసీది ఒళ్లువంచి పని చేస్తుంది. చాకలిరంగానికిగూడా యిల్లా నెమ్మదిగా చెప్పితేనేగాని లాభంలేదు.

అబ్బ! యీ త్రిమూర్తులు యెంత కాణాచిలు. సంసారంలో గుట్టు అనేది దేన్నీ వీళ్లు కాపాడరు గదా. ఆపేటలోవున్న సుబ్బమ్మగారికి సిల్కుచీర లెన్నివున్నాయో, ఆవిడ మొగుడికి జీతంయెంతో... యింకా అనేకసంగతులు చేరేస్తుంది చాకలి. సుభద్రమ్మగారు రాత్రివండిన అన్నం మర్నాడుపొద్దున్న బావగారికి పడేస్తుందనీ, ఆమెకోరకం, పిల్లలకోరకం, గుమాస్తాగారికింకోరకం—యిల్లాగే రకరకాలుగా కాఫీ తయారుచేసి యిస్తుందనీ...యిల్లాంటివే అనేకం మోసేస్తుంది దాసీ రావి. ఇంక వంటావిడమాత్రం! ఐ. సి. యస్ వుద్యోగంలో తాను తొక్కునిగడప వుండదుకదా!

ఈ త్రిమూర్తుల్నికూడకట్టుకొచ్చి ఆట్టిగోడవా, గాభరాలేకుండా గృహపాలన చేయగలిగే గృహిణి అరుదు. వీరి ముగ్గురిప్రేమ సంపాదించి, వారిని అదుపులోపెట్టగలిగి గృహజీవితం శాంతియుతంగా చేయగలిగిన ఆవిడ—యెవరైనావుంటే—ఓ పెద్దరాష్ట్రం యేలగల సమర్థురాలన్నమాట. ఆవిడను ప్రైమ్ మినిస్టరీ యిచ్చెయ్యొచ్చు.

## వైల్డు భాషితాలు

తన్ని మోసగించుకోడంతో మొదలెట్టి, తక్కినవాళ్లని మోసగించడంతో ముగించడమే 'రొమాన్స్' అంటారు.

★

పురుషులు విసిగీ, స్త్రీలు వింతకీ - పెళ్లాడ్డం

★

పెళ్లాడినవాణ్ణి, తను పెళ్లాడనివాళ్లే సుఖపెట్టాలి

★

ప్రేమ పదిలంగా వుండాలంటే, పెళ్లిమాట తలపెట్టకు

(ఆస్కార్ వైల్డ్)

## శ్రీరామప్రార్థన

శ్రీమతి రాజ్ఞి ఇనుగంటి సరస్వతీదేవి

శా. నీ కారుణ్యమునాపయిన్ జిలికినన్ నీరేజపత్రేక్షణా!
నాకోర్కుల్ నెఱవేఱుఁగాన దయతో నన్నీవు మన్నింపుమా
నీకున్ నిశ్చలభక్తి సేవ్యగతులన్ నేర్పొప్పఁగాఁజేసెదన్
నాకాయంబిలనుండుదాక గుణసాంద్రా! రామచంద్రప్రభూ!

మ. మదిలో నెంచుచునుంటి నిన్నెపుడు నన్ మన్నించి రక్షించి-నీ
దు, దయావీక్షణమింతఁజూపి యెటులో దొరంపుఁబ్రేమానస
మ్ముదమొప్పన్దగురీతిఁ బ్రోచి తుదకున్ మోక్షంబుఁ జే కూర్పఁగా
నదనంబొప్పఁగఁ జూతువంచు రఘురామా? ఆర్తరక్షామణీ.

శా. నన్నే తీరుననైన నీదుకృపకున్ బాత్రంబుఁగాఁ జేయు-చోఁ
బున్నెంబంతయు నీకెకల్లు సతులన్ బొక్కింపఁగారాదునీ
కన్నంబ్రోచెడు రక్షకుండెవఁడు? దీక్షావృత్తితోఁగొల్తు; నా
కన్నం నీకిల భక్తులెవ్వరకలంకా! భక్తమందారమా!

## నూతన సంవత్సర ప్రశంస

శ్రీ కృత్తివెంటి వెంకటసుబ్బారావు

క. కృషినిర్నిద్రత అధికృతి
తృషఁబాసి బుధులు కవులు సమృద్ధి దనరి, యు
ద్విషులు కళాస్కులయి యక
ల్మషపథ యశులగుత ధనులు వృషవర్షమునన్

క. వృషలార్తి తొలఁగి ద్విజులను
ఋషిమత మభివృద్ధిగని సువృష్టి సుభిక్షా
త్విషమయి జన మధికారుల
మృషలేక యకలుష వృత్తి వృషమనుతమిలన్

క. అభము శుభమ్మెఱుఁగుత ప్రజ
ప్రభులు నిరంకుశులుగాక భద్రులగుత ధీ
శుభ దగ గృహలక్ష్మి కళా
విభవాయురభీష్టసిద్ధి వేడ్కఁగను వృషన్.

# యుద్ధరంగము

## ● మారణ హోమం

జగత్తు అంతా మేఘావృతమై నిబిడాంధకారంలో మునిగి తేలుతూవుంది. ఎక్కడజూచినా అసూయలు, కుట్రలు, కుతంత్రాలు చెలరేగి వున్నాయి. రక్తపిపాస నవనాగరికతకు అధిష్టానదేవతగా పరిగణింపబడుతోంది. ఆధునికయుగమును రసవంతముగ చేయగల విజ్ఞానము సంపూర్ణముగా ప్రజాక్షయము చేయుట కుపయుక్తమగుచున్నది. తత్వవేత్తల ప్రవచనములు సైతము అసత్య ప్రచారమునకు తావొసంగుచున్నవి. గుళ్లూ, గోపురాలూ, కోటలూ, తోటలూ అన్నీ నేలమట్టమగుచున్నవి. తల్లి ఒడిలో పరున్నపాప, జీవనోపాధికై వెళ్ళిన నాన్న, గుడిలో పూజచేయు అవ్వ-అంతా శత్రువులే! భీకర ప్రచండజ్వాలలకు గురియవవలసినదే! ఇదే యీనాటి యుద్ధతత్త్వము.

## ● హోమకర్తలు

అకలితమగు ఆర్యరక్తం మాలోనే ప్రవహిస్తోంది, మానవజాతికి మేమే పెట్టనికుటం అని విఱ్ఱవీగే జర్మనులు, ప్రాచీనయుగంలో ప్రపంచమును తలకిందుచేసి ఖండాంతర సామ్రాజ్యము నేలగలిగిన రోమను నియంతల సంతతి మేమే యని మురిసిపడే యిటాలియనులు యీ హోమకర్తలు. ఇట్టి అమానుష హోమ నిర్వహణమందు దిట్టదేరిన చేతులుగలవారు - కరటకదమనకుల్లాగ - హిట్లరు ముస్సోలినీలు వెలిసారు. చిన్న రాజ్యములను పిండి పిప్పిజేసి యూరపునంతను జర్మను సామ్రాజ్యముగా మార్చవలెనని యొకని ఆశయము. శత్రువు యేమరిపాటుగా నున్నప్పుడు, అతని పొడిచియో లేక మేకపోతు గాంభీర్యము ప్రదర్శించియో, మధ్యధరా సముద్రము యిటాలియను సరస్సుగా మార్చి ఖండాంతర సామ్రాజ్యము ప్రతిష్ఠించుట యింకొకని ఆశ. జర్మను నియంత - హిట్లర్ జెకోస్లోవేకియా, పోలెండు, డెన్మార్క్, హాలెండు, నార్వే, ఫ్రాంసులలో ప్రళయకాల రుద్రునివలె తాండవమాడి బాంబులు వెదజల్లి శతఘ్నుల కురిపించి ఆ దేశములను నామమాత్రావశిష్టముగా చేయగలిగాడు. ఈ రాక్షసకృత్యాలలో ముస్సోలినీ తన యథాశక్తి సాయపడ్డాడు. ఇంతవరకూ గాథ సక్రమంగానే నడిచింది; నియంతల జాతకఫలం పండిందనిపించింది. పాపీ చిరాయుః అన్నారు అంతా.

## ● ధృవతార

అంధకారమయంగా కన్పట్టిన ఆకాశం కారుమబ్బుల వీడి తేరుకోడం ప్రారంభించింది. మాటు వడిన నక్షత్రాలు తొంగిచూచాయి. క్రౌర్యానికి లొంగని వీరలక్షణం యింకా యూరోపులో మిగిలివుంది అని చాటాడు జెనరల్ మెటక్సాస్. గ్రీసు చిన్నదైనా ఇటాలియన్ నియంతృత్వాన్ని ప్రతిఘటించి ధృవతారలా మెరిసింది.

## ● ఇటలీ గండం

ముస్సోలినీ బెదరింపులు గ్రీసు లక్ష్యపెట్టలేదు. 'స్వాతంత్ర్యరక్షణలో మండి మసియైనా అవడానికి అంగీకరిస్తాను గాని శత్రువుకు లొంగి పరాభవం పొందను' అని ఘట్టిగా బదులుచెప్పింది. ఇటాలి

యన్ దండులను అకుంఠిత పరాక్రమంతో ప్రతిఘటించి తన స్వాతంత్ర్యాన్ని రక్షించుకుంది. ఆల్బేనియాను యుద్ధరంగంగా మార్చి జయశ్రీని చేపట్టింది. నానాజాతిసమితి నెదిర్చి అబిసీనియాను కూల్చిన ముస్సోలినీ గ్రీసుయొక్క ధాటి కాగలేకపోయాడు. ఇటాలియన్ సైన్యము పట్టణములనుండి పల్లెలకు, పల్లెలనుండి కొండలకు, కొండలనుండి అడవులకు తరిమితరిమి కొట్టబడింది. రోమన్ సామ్రాజ్యస్థాపన కియ్యకొనిన ముస్సోలినీ పూర్తిగా పరాభవం పొందాడు. ఆశలు నిరాశలుచేసుకుని, ఆత్మగౌరవం చంపుకుని శరణార్థియై బెర్లిన్‌కు కాలు ఝాడించాడు ఇటాలియన్ నియంత.

● ఆఫ్రికా

గోరుచుట్టుపై రోకటిపోటుమాదిరి ఆఫ్రికాలోని యిటాలియన్ సామ్రాజ్యము బ్రిటీషు సామ్రాజ్య సేనల ధాటి కాగలేక క్రుంగి కుమిలిపోవడం ప్రారంభించింది. బార్డియా, బెర్బెరా కోటలుగూడ ఒకటి తరవాత ఒకటి బ్రిటీష్ ఫిరంగులదెబ్బకు కూలినవి. గ్రాజియానీ పరాభూతచిత్తుడై తన రాజీనామా దాఖలు చేసుకున్నాడు. తూర్పు ఆఫ్రికాలోని యిటాలియనుల గతి యిది. ఇంక అబిసీనియా మాత్రము! అజ్ఞాత వాసం చేయుచున్న రాజు నీగస్ తగిన యదను యిదే యని గ్రహించి తన రాజ్యమును ప్రవేశించి శంఖారావము పూరించాడు. ఫేసిస్టు దొరల పిడికిట మాటుమడిగి సహనశక్తితో యింతకాలమూ బానిసత్వము ననుభవించుచున్న అబిసీనియను ప్రజలూ, వారి నేతలూ నీగస్ యుద్ధభేరీ విని అబిసీనియా స్వాతంత్ర్యపతాకము నండజేరి ఫేసిస్టు సామ్రాజ్యతత్వమును ఎదుర్కొన్నారు. వీరికి అన్నివిధములా బ్రిటిషు సైన్యమేకాక దక్షిణ ఆఫ్రికా విమానదళముగూడ అండగా నిలిచింది. ఆఫ్రికాలో ఒకవైపు వేవెల్ సైన్యము, మఱియొకవైపు అబిసీనియన్ తిరుగుబాటుకు దక్షిణాఫ్రికా సహకారమూ—యీ రెంటిమధ్యా యిటలీ కిక్కిరిసిపోయి కొన వూపిరితో మిగిలింది. ఆఫ్రికాలో యిటాలియన్ సామ్రాజ్యము అస్తమించిందని చెప్పవచ్చు.

● తారాఫలం

నీలాకాశం మేఘావృతంగా జేశాడు హిట్లరు. మినుకు మినుకుమని మెరిసే నక్షత్రజాలం అంతర్థానమైనట్లు తోచింది కొంతకాలం. పుణ్యాం ఫలించినట్లు ధృవతారలా గోచరించింది గ్రీసు. ఈ తార తన దివ్యమైన వెలుగును నలుదిక్కులా వెదజల్లింది. క్రమక్రమంగా బాల్కను రాష్ట్రాలను ఆవరించుకొంటూన్న కారుచీకట్లను చెల్లాచెదరు చేసింది. బల్గేరియా యుగోస్లేవియాలకు నూతనోత్సాహం ప్రసాదించి ధర్మమార్గమును ప్రబోధించింది. కాని బలం చాలలేదు. ఒకటి తరువాత యింకొకటి ఆ మూడుదేశాల ముఠాతో (axis) కలిసాయి, ఆత్మవంచన చేసుకుని. టర్కీమటుకు నిశ్చయించుకుంది గ్రీసుపథమే తొక్కాలని. గ్రీసు టర్కీలు మిగిలాయి యూరపులో స్వాతంత్ర్యజ్యోతిని ఆరాధిస్తూ! ఆజ్యోతి నార్పుటకు నియంతలకు శక్తిలేదు.

● కృష్ణ తాటస్థ్యం

మహా భారతయుద్ధంనాటిగాథ తిరిగి ప్రదర్శింపబడుతోంది. దుష్టులగు కౌరవులకే బలసంపత్తి యెక్కువయి పాపము ఫలించునను భయము పొడమినప్పుడు భగవానుడు శ్రీ కృష్ణుడు ధర్మపక్షముచేరి పాండవులకు విజయం చేకూర్చాడు. పార్థునకు సారథియైనా కృష్ణుడు తటస్థుడుగానే పరిగణింపబడ్డాడు, వైర

పక్షంవారిచేతగూడా. ఆ కృష్ణ తాటస్థ్యమునే యిప్పుడు అమెరికా అనుసరిస్తోంది. ఈ మధ్యనే తీర్మానించబడిన అరువు కవులుబిల్లు ఇంగ్లండుపాలిటి అమృతవర్షం అయింది. తన తాటస్థ్యమును రక్షించుకుంటూనే అమెరికా యింగ్లండుకు సర్వసహాయమూ చేయుటే యీబిల్లు ప్రయోజనము. అనతికాలంలోనే మరికొన్ని మహాయుద్ధనౌకలూ, యితరయంత్రాది ఉపకరణములూ యింగ్లాండుకు చేరనున్నాయి.

## ● ఎత్తుకుపై యెత్తు-మట్సుఓకా ప్రయాణం

ఆలసించిన కొలదీ-అమెరికా సహాయంతో బ్రిటన్ అన్నిరంగాలలో ఒక భీకరయుద్ధానికి సిద్ధపడుతుందనీ, బ్రిటను అనతికాలంలోనే అజేయం అవగలదనీ హిట్లరు గ్రహించాడు. జపానును రెచ్చగొట్టి అమెరికాకు పని కల్పిస్తేనేగాని యింగ్లండుకు జరిగే సరఫరా ఆపడానికి వీలవదని తెలుసుకున్నాడు. దీనికి ఒకటేమార్గం! ఉత్తర దక్షిణధృవాల్లో సంచరించే జపాను రష్యాలను యేదోవిధంగాకలిపి మసిబూసి మారేడి కాయచేస్తేనేకాని జపాను అమెరికాను ప్రతిఘటించలేదు. చైనాలోని జపాను సామ్రాజ్యమునకు రష్యాపక్కలోని బల్లెమువంటిది. రష్యా సహకారంలేనిదే మంచూకో చేతిలోంచి జారిపోతుంది. ఈ ఆపద కాచుకుని పసిఫిక్ మహాసముద్రంలో అమెరికాను ఢీకొనడానికి ప్రయత్నంచేసేందుకే జపాను విదేశాంగ మంత్రి మట్సుఓకా యూరపుకు మాస్కోమీదుగా ప్రయాణం అయాడని తోస్తుంది. మాస్కోలో స్టాలిన్‌తో విందారగించాడు. జర్మను విదేశాంగమంత్రి రష్యానియంతకేదో చెప్పివుంచాడని తెలుస్తోంది. ఫలితం ఏమవుతుందో తెలియదుయింకా.

ఇటలీ పతనం హిట్లరును వుడికించింది. దానికి ప్రతిఫలంగా బల్గేరియా, యుగోస్లావియాలను మెట్టి తనలో కలుపుకున్నాడు హిట్లరు. బాల్కను ప్రాంతము నరకాసుర ఆగమునకు అట్టుడికిపోతోంది. గ్రీసు టర్కీలే మిగిలాయి బ్రిటనుకు అండగా. ఈ తరుణంలో అరువు కవులనే బిల్లు మూలకంగా అమృతవర్షం కురిపించింది అమెరికా. దీనికి గాభరాపడి హిట్లరు స్టాలిన్ మట్సువోకాల నాశ్రయించాడు. ఆశ్రయ ఫలితం త్వరలోనే వెల్లడిఅవుతుంది. ఇవి యీనాటి అంతర్జాతీయ నాటక విశేషాలు.

ఈ నాటకం సుఖాంతంగా పరిణమిస్తుందా విషాదాంతంగా పరిణమిస్తుందా అనే సందేహంలేదు. నాలుగు సముద్రాల్లో బ్రిటీషు నౌకాదళం ఏకచ్ఛత్రాధిపత్యం వహిస్తూన్నంతకాలమూ, ప్రజాస్వామిక పక్ష క్షేమానికి తన సంపత్తిని అమెరికా వినియోగిస్తూన్నంతకాలమూ, ప్రాక్పశ్చిమదేశాల సహానుభూతి యింగ్లండుపై ప్రసరించినంత కాలమూ, ప్రజాస్వామికమునకు, స్వాతంత్ర్య పటిమకు భంగము వాటిల్లదు.

ఉగాది 28-3-41 } వృషదేవత ఆమె చల్లని చేతులతో మేల్కొల్పింది జగత్తునంతా. ప్రజాస్వామికానికి యీ నూతన వత్సరాగమనం యినుమడించిన సంతోషమును కూర్చినదనుటకు యీనాటి వార్తలే తార్కాణం. ఫాసిస్టుక్రౌర్యానికి యుగోస్లావియా మంత్రులు జంకి మూడు దేశాల ముఠాలోజేరుటకు సంధిపత్రముపై సంతకముజేసినా, బాలరాజుపీటరు దేశద్రోహముచేసిన మంత్రులను వెడలగొట్టి నూతన మంత్రివర్గాన్ని ప్రతిష్ఠించాడు. యుగోస్లావియనులు వారి స్వేచ్ఛాస్వాతంత్ర్యములను రక్షించుకోడానికి కంకణం కట్టుకున్నారు. హిట్లరు మహాశయుడు యింక అతని బాల్కను కుతంత్రాలకి తిలోదకము లిచ్చుకోవలసిన పరిస్థితు లేర్పడ్డాయి. యుగోస్లావియనుల ధైర్యోత్సాహాలకి ప్రపంచం భళీ అంది.




## స్త్రీ విద్యార్థినులకు ప్రత్యేక వసతిగృహములు

ఆంధ్రా యూనివర్సిటీ సెనేటుయొక్క వార్షిక సమావేశమున శ్రీమతి కామేశ్వరమ్మగారు స్త్రీ విద్యార్థినుల సౌకర్యార్థమై వాల్తేరునందేర్పరుపబడు వసతిగృహము విషయము ఏస్థితియందున్నదని ప్రశ్నించారు. దానికి జవాబుగా వైస్‌ఛాన్సలర్ రెడ్డిగారు స్త్రీల ప్రత్యేక వసతిగృహనిర్మాణమునుగూర్చి ఆలోచనలూ జరిగాయనీ, త్వరలోనే ఆ పురమునందలి అన్ని కళాశాలలయందలి విద్యార్థినులకును ఒకే వసతి గృహము యేర్పాటు కాబోతున్నదనీ సెలవిచ్చారు. స్త్రీ విద్యార్థినుల "హాస్టల్సు" విషయము తిరిగి ప్రాముఖ్యతకు తీసుకువచ్చిన కామేశ్వరమ్మగారునూ, వారి ప్రయత్నఫలితంగా "హాస్టలు" సౌకర్యం కలుగ జేస్తూన్న రెడ్డిగారును అభినందనీయులు.

స్త్రీకి విద్య అవసరమా అనవసరమా అనునది యీకాలమునకు చెందినసమస్యగాదు. మూఢసాంప్రదాయములతో ప్రాకులాడే యే కొద్దిమంది మహానుభావులోతప్ప మిగతా ప్రపంచం యీ సమస్యను సక్రమంగా పరిష్కారంచేసి చాలా సంవత్సరాలయింది. స్త్రీ విద్యను బహుళంగా వ్యాప్తిచేయడాని కనువుగు సాధనల నాలోచించడమే ప్రస్తుత కర్తవ్యం.

ఆంధ్రదేశంలో ఉన్నతవిద్య స్త్రీలలో అంతగా వ్యాప్తి చెందకపోవడానికి ప్రత్యేక సౌకర్యాలు లేకపోవడమే కారణము. మన రాష్ట్రంలో పట్టుమని ఒకటైనా స్త్రీలకు ప్రత్యేకంగా కళాశాలలేదు. పాతుకుపోయిన సంఘమర్యాదలను, పిచ్చిభ్రమలను అధికారులు గమనించి పురుషులతోబాటు ఒకే కళాశాలలో విద్య నభ్యసించుట కభ్యంతరముగల స్త్రీలకు ప్రత్యేక కళాశాలలవసరము.

ఇంతకన్నముఖ్యమైనది స్త్రీ విద్యార్థినులకు ప్రత్యేక వసతిగృహములు యేర్పాటుచేయుట. ఆంధ్రదేశంలో యించుమించు ప్రతీ పట్టణంలో కళాశాలలున్నా, విద్యాధికారులచే నడుపబడు ప్రత్యేకవసతి గృహములు బహు అరుదు. స్త్రీలకు ప్రత్యేకంగా 'హాస్టల్' లేకపోవడం స్త్రీ విద్యను నిరుత్సాహపరచడమే అవుతుంది. పొరుగూరి కాలేజీలలో ప్రత్యేకవసతి గృహములు లేమి కారణముచే అనేకమంది స్త్రీలు వున్నతవిద్యకు స్వస్తి చెప్పవలసివస్తోంది. వివిధ విద్యాసంస్థలకు కేంద్రస్థానమైన ఆంధ్ర విశ్వవిద్యాలయముననే యింతవరకు స్త్రీ విద్యార్థినులకు వసతిగృహ సౌకర్యము లేకపోవడం వారి దురదృష్టంకన్న అధికారుల నిర్లక్ష్యము చూపుతోంది.

పాశ్చాత్యదేశములలో సంపన్న గృహస్థులు దూర దేశమునుండివచ్చు విద్యార్థులను తమ యిండ్లలోనే "Paying Boarders" గా పెట్టుకుని వారికివలయు సౌకర్యములన్నీ కల్పిస్తారు. గృహస్థులు డబ్బు

పుచ్చుకుని అన్నంపెట్టడం మహాపాపం అనే దురభిప్రాయం యీ దేశంలో ప్రబలివుండడంచేత, విద్యార్థులకు యీ సౌకర్యం యిక్కడలేదు. ఉన్నత విద్యాభిలాషులై స్వగృహములవిడిచి దూరప్రాంతములకు పోయినా యువకులూ, యువతులూ సంసారంలోవుండే మాధుర్యం క్రోలుతూవుండడానికి **(sweetness of home)** అవకాశం లభిస్తుంది. అధికారవర్గమువారి నిర్లక్ష్యత అయితేనేమి, సంపన్నుల నిరాభావమైతేనేమి చివరకు తేలినది విద్యార్థినులకు తీరనియిబ్బంది.

స్త్రీ విద్యార్థినులు ప్రత్యేకంగా స్వయంగా కళాశాలాధికారుల ప్రసక్తిలేకుండా నలుగురైదుగురుతోడి విద్యార్థినులను చేరదీసి ఒకయిల్లు అద్దెకుపుచ్చుకుని అందులో కాలక్షేపంచేయడానికి సాహసించారా, అనతికాలంలోనే గుసగుసలు బయల్దేరుతాయి. వున్నవీ లేనివీ పుట్టించి గోరంతలు కొండంతలుగాచేసి స్త్రీలను అపవాదులకు గురిచేయడానికి సాహసించేపాడు రోజులివి.

హాస్టలు పెట్టేటప్పుడు అధికారులు గుర్తించవలసిన విషయాలు చాలావున్నాయి. 'హాస్టలు అంటే కాఫీ హోటలుగాదు. ఎంతో దూరంనుంచి తల్లిదండ్రులనూ, సమస్త సౌకర్యాలనీ విడిచిపెట్టివిద్యకై ప్రాకులాడుతూవచ్చిన ఆడపిల్లలకు వునికీ, యితర సౌకర్యాలూ కలిగించేసంస్థ. హాస్టలు అంటే ఇంట్లో తల్లి యిచ్చే ఆదరణ, లాలన-అన్నీ యిచ్చి యింటినిమరిపించే దయారసం చూపించ గలిగిన పాలకవర్గమున్నప్పుడే అది సరియైన 'హాస్టలు' అనిపించుకుంటుంది. నిర్విచారంగా కాలంగడిపి విద్యా వ్యాసంగం చేసుకోడానికి యెక్కువ తోడ్పడుతుంది. ఇది హాస్టలు అధికారిణి అంటే 'మేట్రన్'యొక్క గుణసంపత్తిపై యెక్కువగా ఆధారపడి వుంటుంది.

హాస్టలు మేట్రన్ సదభిప్రాయంకలిగి వుండాలి. ఆమెకు ఉన్నతాదర్శాలు కలిగివుండాలి. తాను ఒక అధికారిణి అనీ, సమస్త విషయాల్లోనూ విద్యార్థినులు ఆమెచెప్పు చేతల్లోనేవుండి, ఆమె కనుసైగలలోనే మెలగాలి అనే దురభిప్రాయాలకు తావియ్యకూడదు. వసతి గృహానికి 'మేట్రన్' మాతృదేవతగా వుండడానికి ప్రయత్నించాలిగాని 'జెయిలరు'గా మారకూడదు. లేకపోతే వసతిగృహం కారాగారంగా తయారై విద్యార్థినుల జీవితం దుర్భరంగా మార్చివేస్తుంది. విద్యార్థినులను అదుపు ఆజ్ఞలలోపెట్టి వారిని ఒక క్రమశిక్షణ కలవరచడం ముఖ్యమే. కాని శిక్షణకు ఉదారం జతపర్చాలి. గట్టిగాదగ్గితే మేట్రను యేమంటుందో అనే పరిస్థితులున్న హాస్టలు నరకంలా తయారవుతుంది. అందుచేత హాస్టలుకు సరియైన పాలకవర్గంయెంచి పెట్టడం అవసరం. అందులోనేవుంది నేర్పు. బి. యే. మటుకు ప్యాసయి, మాతృహృదయమంటే యేమీయెరుగని 'మిస్సమ్మ'ను మేట్రనుగాచేస్తే యీ అనర్థాలు యేర్పడుతాయి.

మరోవిషయం. విద్యార్థినులకు వునికి సదుపాయములు కలుగజేసి వారిని అనవసరమైన అపవాదులకు గురి కానియ్యకుండా రక్షించడం హాస్టలు ప్రధానోద్దేశ్యము. ఈ సదవకాశం భాగ్యవంతులకూ, బీదలకూ సమంగానే అందుపాటులో వుండాలి. హాస్టలు జీవితం అధిక వ్యయహేతువుగాకుండా చూడాలి. అంటే బీద విద్యార్థినులకుగూడా హాస్టలు ఖర్చు అందుబాటులో వుండేటట్లు చెయ్యాలి. హాస్టల్సు కల్పించేటప్పుడు ఈ పైవిషయములు యూనివర్శిటీ అధికారులు దృష్టియందుంచుకుంటారని మా ఆశ.

**Edited by Dr. K. N. Kesari, Printed and Published by Dr. S. Seshagiri Rao, at the Lodhra Press, 15, Westcott Road, Royapettah, Madras.**